సుఖైర్వా దుఃఖైర్వా సదృశపరిపాకః ఖలు తదా
త్రినేత్రం కస్త్యక్త్వా ధనలవమదాంధం ప్రణమతి। 16

టీ. మమ = నాకు, మహారామచరితే = గొప్పతోటలచే రచింపఁబడిన-పెను తోఁట లిరుప్రక్కలఁ గల, పథి = మార్గమునందు, భిక్షా = బిచ్చము, దుష్ప్రాపా న = దొరకరానిది కాదు-దొరకునదేయనుట, భూః = భూమి, ఫలైః సంపూర్ణా = పండ్లచే నిండినది. విటపిమృగచర్మ అపి = చెట్లయు మృగములయు తోలును - నారలును కృష్ణాజినమును, వసనం=వస్త్రము, సుఖైర్వా = సుఖములచేతఁగాని, దుఃఖైర్వా = దుఃఖములచేతఁగాని, సదృశపరిపాకఃఖలు = సమమైనపరిణామమేగదా-భిక్షాదుల నేనింగ నట్టియుతిని బూనినపుడు-సుఖములైనఁగాని దుఃఖములైనఁగాని సమానముగానే స్ఫురించునుగాని భిన్నముగాఁ దోఁచదనుట, తదా = అప్పుడు-అట్టిపరిపాకము గలిగినప్పుడు, కః = ఎవఁడు, త్రినేత్రం = ముక్కంటిని, త్యక్త్వా = విడిచి, ధనలవమదాంధం = ద్రవ్యమొకింతచేనైన గర్వముచేఁ గన్నుఁగాననివానిని, ప్రణమతి = నమస్కరించును-వానికి నడఁగిమడఁగి కొలువుసేయును-ఎవ్వఁడును జేయఁడని భావము.

ఉ. పంటవలంతినిం గలవు కే పండులు నారలుఁదోలుఁ బుట్టమా
గొంటకు బిచ్చమున్ సులువగుం బెనుఁదోఁటలమీఁదుత్రోవలో
రెంట సుఖాసుఖంబు లనుకరీతి యొకం డగు నిట్టియేని ము
క్కంటిని వీడి యల్పధనగర్వితు నెవ్వఁడుఁ గొల్వఁ బూనునే. 16

శ్లో॥ యద్వక్త్రం ముహురీక్షసే న ధనినాం బ్రూషేనచాటుం మృషా
నైషాం గర్వగిరః శృణోషి న పునః ప్రత్యాశయా ధావసి।
కాలేబాలతృణాని ఖాదసి సుఖం నిద్రాసి నిద్రాగమే
తన్మేబ్రూహి కురఙ్గ కుత్ర భవతా కిం నామ తప్తం తపః॥ 17

టీ. హేకురఙ్గ = ఓజింకా, యత్ = దేనిచే, ధనినాంముఖం = ధనవంతుల మొగముల, ముహుఃఈక్షసేన = మాటికినిజూడవో, మృషా = వ్యర్థముగా, చాటుం = స్తుతిభాషణములను, బ్రూషేన = పలుకవో, ఏషాం = వీరియొక్క-పూర్వము చెప్పఁబడిన ధనికులయొక్క, గర్వగిరః = గర్వపుమాటలు, న శృణోషి = వినవో, పునః = మఱియు, ప్రత్యాశయా = పేరాసచేత, ధావసి (వారినిగూర్చి) పరుగునఁ బోవో, కాలే=అఁకలికాలమున, బాలతృణాని = లేఁతగడ్డిపరకలను, ఖాదసి = మేయుదువో, నిద్ర ఆగమే = నిద్రరాకయందు-నిద్రరాఁగా, సుఖం = హాయిగా, నిద్రాసి = నిదురింతువో. తతః = దానిచేత-ధనికముఖమును జూచుట మున్నగు కారణములచేత, భవతా = నీచేత, కుత్ర=ఎక్కడ, కింనామ=ఏమిదో, తపః = తపము, తప్తం = తపింపఁబడినదో, మే బ్రూహి=నాకుఁ జెప్పుము. ధనికుల మొగము చూడకయుండుటమున్నగు నీ యిటువంటి చరితము బుద్ధిమంతుఁడగు పురుషునియందును గానిపింపదు. కాన యిట్టిచరిత యేతపముయొక్క పరిపాకమో తెలియదు. దానిం జెప్పుమని భావము.

చ. కనుఁగొన వర్ధవంతుల మొగంబులు మాటికి మెచ్చులాడవున్
వినవును వారిబెట్టిదము వేమఱుఁ జెంతఁ బాఱి వాసమైఁ
గొనుదువు పూరియుం దఱిని గూర్కుదు నిద్దురవేళ హాయిగా
నొనరఁగ నేతపంబుఫలమో యిది చెప్పఁగదే కురంగమా. 17

---

శ్లో॥ సమారమ్భా భగ్నాః కతిన కతివారాంస్తవ పశో
పిపాసోస్తుచ్ఛేస్మిన్ద్రవిణమృగతృష్ణార్ణవజలే।
తథాపి ప్రత్యాశా విరమతి న తేఽద్యాపి శతధా
నదీర్ణం యచ్చేతో నియత మశనిగ్రావఘటితమ్. 18

టీ. హేపశో = (కొమ్ములును దోఁకయులేని) పశువా-పశుప్రాయుఁడా యనుట, తుచ్ఛే = నీచమైన, అస్మిన్ = ఈ, ద్రవిణమృగతృష్ణార్ణవజలే = ద్రవ్యమనెడి యెండమావుల సముద్రమందలినీటియందు, పిపాసోః = త్రావనిచ్ఛగించు, తవ = నీకు, కతివారాన్ = ఎన్నిమాఱులు, కతిసమారమ్భాః=ఎన్నికార్యారంభములు, నభగ్నాః = చెడినవికావు-పెక్కుమాఱులు పెక్కుప్రారంభములు చెడినవనుట, తథాపి = అట్లయ్యును, తే=నీకు, ప్రత్యాశా= పేరాస, అద్యాపి=ఇంకను, నవిరమతి = ఉడుగకున్నది. ఇట్లయును, యతః = ఎందుచేత, చేతః = నీమనస్సు, శతధా = నూఱుభాగములుగా, నవిదీర్ణం=చీల్పఁబడదో-చీలదోయనుట, (అతః=అందుచేత, తత్ = అది), నియతః= నిశ్చయముగా, అశనిగ్రావఘటితమ్ = వజ్రపుఱాయితో చేయఁబడినది. ఇంతకఠినము కాకున్నచో అన్నికార్యములు భగ్నమైనందుల కది చీలియేయుండు నని భావము.

చ. ద్రవిణమరీచికాబ్ధికలితం బగుతుచ్ఛజలంబుఁ ద్రావఁగాఁ
దివిరెడునీకుపూనికలు దేఁకన నెన్నియొ యెన్నిమాఱులో
యవిసెను గాదె యోపశువ యైనను నింక దురాశ మాన వీ
వవు నవు నీదుచిత్త మరయం బటువజ్రశిలాకృతం బగున్. 18

భర్తృహరిసుభాషితము అధికశ్లోకములు

సమాప్తము.

---

శ్రీరస్తు.

మహోపాధ్యాయ ఎలకూచి బాలసరస్వతీకృత

# మల్లభూపాలీయము

---

# నీతిశతకము

## మూర్ఖపద్ధతి

శా. శ్రీమద్బాలసరస్వతీ ప్రకటలక్ష్మీహేతువై శాంతమై
యామోదావహమై నిజానుభవవేద్యంబై యనేహోదిగా
ద్యామేయ ప్రవిబోధరూపమహితంబై యొప్పుతేజంబు ప్రా
పై మీవ స్సిరు లీవుతన్ సురభిమల్లా నీతివాచస్పతీ. 1

మ. సతతంబు న్మది మత్సరాధ్యులు పరిజ్ఞాతల్ మహీనాథు లు
న్నతసంపన్మదదుష్టచిత్తు లితరుల్ తర్కింప నజ్ఞానమూ
షితభావు ల్వినువార లెవ్వ రొడలన్ జీర్ణంబు లౌఁ గాక యా
కృతితు ల్నేర్చినసూక్తము ల్సురభిమల్లా నీతివాచస్పతీ. 2

మ. నిలుపన్వచ్చు స్వభావమూర్ఖుఁ డగువానిం గొల్చి యత్యంతము
న్నిలుపన్వచ్చు విశేషవేది యగువానిం గొల్చి యొంగోరి జ్ఞా
నలవాహంకృతిదుర్విదగ్ధుఁ డైనమనుజున్ రంజింప శక్యంబుగా
దలభాషాపతి కేనియు న్సురభిమల్లా నీతివాచస్పతీ. 3

శా. కాలాహిం దలఁ దాల్ప వచ్చు విరిపాంకౌనం, దరంగప్రకో
త్తాలం బైనపయోధిఁ జేతులనె యీఁదవచ్చు, నత్యుగ్రదం
ష్ట్రాలగ్నం బగుమానికంబు హరియింపన్వచ్చు నెల్లేని మూ
ర్ఖాళిం దెల్పఁగ రాదు శ్రీసురభిమల్లా నీతివాచస్పతీ. 4

మ. వసుధం గుందెటికొమ్ము దెచ్చుకొనఁగా వచ్చుం బ్రయత్నంబున
న్సికతం ద్రావ జ్జల మెండమావుల నెయుంబిం గాంచ వచ్చు న్నిజం

విసుక న్మానియుఁ బెండ వచ్చుఁ బ్రతిభాహీనాత్ముఁ డౌమూర్ఖుఁ దె
ల్ప సమర్థ్యుఁడు లేఁ డిల న్సురభిమల్లా నీతివాచస్పతీ. 5

మ. దిరిసెంపుఁబువ్వురేకచేత వజ్రమణి ఛేదింపఁ దలఁచు న్మద
ద్విరదేంద్రంబు మృణాళతంతువున బంధింపంగ నూహించు మా
ధురి నింపం జనుఁ దేనెచే లవణపాథోరాశికి న్మూర్ఖుఁ దె
ల్ప బుధాక్తం బిడువాఁడు శ్రీసురభిమల్లా నీతివాచస్పతీ. 6

శా. స్వాయత్తంబు కడు న్హితంబు నయి మౌఢ్యం బప్రకాశంబుగాఁ
జేయన్ బ్రహ్మ సృజించినట్టివిబుధశ్రేణీసమాజంబులన్
డాయ న్నిక్కిలియుం బ్రియావహము మౌనం బొక్కటే భూషణం
బై యజ్ఞావళి కొప్పెడు న్సురభిమల్లా నీతివాచస్పతీ. 7

మ. కరియుంబోలె మదాంధుఁ డౌదు నొరులం గైకొక త్రోల్గాల్ల ము
ష్కరుఁడౌ నొక్కఁడ నే ఘనుండ ననుఁ బ్రజ్ఞావంతు లౌధీరశే
ఖరులం జూడఁగఁ జూడఁగాఁ దరుసఁ దద్గర్వంబు రోగంబున
ట్లరుగ న్నీచుఁడఁ దా నను న్సురభిమల్లా నీతివాచస్పతీ. 8

శా. క్రువ్వ గ్గాలుచు నేదుకంపుతలచున్ రోఁతై తలిం బాసి పె
ద్దవ్వ న్బ్రింగినగ్రభాస్థిఁ దినుచున్ సుప్రీతి నై జాగిలం
బవ్వేల్పుందొరఁ జూచి కొంకదు గృహద్వారావమానం బొరు
ల్నవ్వ న్నీచుఁడు లోఁగునే సురభిమల్లా నీతివాచస్పతీ. 9

మ. తొలుత న్మిన్నునుండి శంభుజడలందు న్వ్రాలె నాపిమ్మటన్
మలరామేటిపయిం బడె న్మహి మఱిన్ జాఱెం గొరి న్నూఱుభ్రా
గులఁ బాథోనిధిఁ జొచ్చె గంగ యవివేకశ్రేయునుద్యోగము
ల్పలుపాట్లం జనుఁ జూ కడు న్సురభిమల్లా నీతివాచస్పతీ. 10

## విద్వత్పద్ధతి.

మ. చదువు ల్చెప్పుదు శిష్యులన్ మనుచు బ్రజ్ఞావంతు లెందేనిఁ బెం
పొదవ న్గొల్లని కమ్మఁజూఁపుసుఁబుల ట్లున్నన్ ధరాభర్తకే
కొదవ గా కరము లేక యుండియు మహాగ్రు ల్పండితగ్రామణుల్
మది నూహింప నలంతులే సురభిమల్లా నీతివాచస్పతీ. 11

శా. ఏనాఁట న్జన దేరి కిచ్చిన సుఖోర్వృద్ధంబ యై యుండు ని
త్యానందం బొనరించు ప్రుచ్చుల కశక్యం బౌ హరింప న్బ్రియుం
బూన న్విద్యయె యో మహాధనము మాన్యుఁ డైనవిద్యాఢ్యుఁ డేఁ
డా నొంప న్దగు నల్కఁచే సురభిమల్లా నీతివాచస్పతీ. 12

మ. గురుశాస్త్రార్థగరిష్ఠు లైన బుధుల న్గోపింపఁ గా రాదు రా
జ్యరమల్ వారికి దొడ్డ గావు తృణ మెట్ల ల్లుద్యదశ్రాంతబం
ధురదానార్ద్రకపోల లైనకరికి న్డొడ్డా మృణాళంబు గా
వ్యరసాస్వాదనభోజ శ్రీసురభిమల్లా నీతివాచస్పతీ. 13

శా. ఉల్లం బక్కలహంసపైఁ గుపితమై యున్న న్వినోదింపఁగా
నిల్లౌ దానిసరోజినీవనమె మాయింప న్సమర్థుండు తా
నీళ్లు న్పాలును నేర్పరింపఁ గలపాండిత్యంబు మాన్పంగ లేఁ
డల్లోకేశ్వరుఁ డేమెయి న్సురభిమల్లా నీతివాచస్పతీ. 14

మ. కమనీయం బగువిద్యభంగిఁ దనుశ్శృంగారంబు గల్పింప లే
పమ లేందుద్యుతు లైనహారములు కేశాలంక్రియ ల్మజ్జనం
బు మనోజ్ఞాంగదచందనాదు లఖిలంబు న్బోవుఁ బోదెందు వా
క్యమయం బౌ తొడ వేరికి న్సురభిమల్లా నీతివాచస్పతీ. 15

మ. చదువే రూపము గుప్త మాధనము పూజ్యశ్రేణిపూజ్యంబు స
మ్మదము న్కీర్తియు భోగ మిచ్చు నృపసన్మానంబు గల్పించు నె
ల్లదెస న్దోడ్పడు దైవతుల్యము సిరు ల్దా మిట్టివే యాపసుల్
చదువు ల్నేరనివారె సూ సురభిమల్లా నీతివాచస్పతీ. 16

మ. సుకవిత్వంబె ప్రభుత్వ మీరసమె ద్వేషు ల్కాండకాఁడే మహా
హి కరం బోర్మియె జోడు విద్యయె ధనం బిష్టుండె దివ్యౌషధం
బకృతజ్ఞం బగుజ్ఞాతియే యనల మిం పౌసిగ్గె సద్భూషణం
బకరాళ ప్రతిభానిధీ సురభిమల్లా నీతివాచస్పతీ. 17

మ. హితు మైత్రి న్జెడు ధూర్తత న్గురు క్షమ న్భృత్యు న్దయ న్వైరి శూ
రతఁ దజ్జ్ఞు ఋజుత న్నృపాలు నయచర్య న్దుష్టు న్సప్రీతి నా
ర్యతతి న్బ్రీతి యథార్థత న్నెలవున య్యల్సుమ్ము లోకస్థితుల్
జతి గావించుమహామహు ల్సురభిమల్లా నీతివాచస్పతీ. 18

మ. మతిజాడ్యం బడఁచు న్నిజంబు గఱప న్మానోన్నతి న్నించు దు
ష్కృతముల్ ద్రుంచు మనఃప్రసాద మిడుఁ గీర్తిస్ఫూర్తి గావించు ని

క్షోణి నార్యుండు తదీయసంగతిమెయి న్నిదించు సర్వారముల్
ప్రతిభానూత్నఫణీశ్వరా సురభిమల్లా నీతివాచస్పతీ. 19

మ. తుల లే కెందుఁ బ్రసిద్ధు లౌచు రసిసిద్ధులౌ వ్రాలె విద్వత్కవీం
ద్రులు భాసిల్లుదు రమ్మహాత్ములయశస్స్తోమంబు లన్విగ్రహం
బుల కెక్కాలమున న్జరామరణసంభూతవ్యథల్ లేవు శీ
లలసత్పుణ్యగుణాశ్రయా సురభిమల్లా నీతివాచస్పతీ. 20

---

## శౌర్యపద్ధతి

మ. జర నైన న్క్షుధ నైన నొప్పి నయిన న్శైథిల్యసంప్రాప్తి నై
న రుజాదుర్దశలందు నైనఁ దుది నైన న్మత్తవేదండమం
భర పైకాశనకాంక్షి యైనమృగభూపాలుండు పుల్మేయునే
యరయ న్మానధనుండు శ్రీసురభిమల్లా నీతివాచస్పతీ. 21

మ. పసి మొక్కెంత గలాదో లేదో క్షుధ దీర్ప న్జాల కెప్పాటిదో
పసరం పెమ్ము లభించి మక్క చెలఁగు న్బజ్జ న్మకా లెన్నియేన్
పనియింపం గన దేనుఁగుం దినఁ జను న్హర్యక్ష మా నా జనుల్
స్వసమర్థస్పృహు లౌదు రా సురభిమల్లా నీతివాచస్పతీ. 22

మ. భువి పైఁ జాఁగిలి తోఁక యూఁచు వదనంబు న్బట్టయు న్సారెఁ జా
పు వెస న్బట్టెఁడుముద్దకై శునకి మెప్పు న్భద్రవేదండ మా
ఖవణం బల్లనఁ గైకొను న్బహునుతు ల్గావింపఁ దా నెంతో సాం
పవులేఁజూపులఁ జూచుచు న్సురభిమల్లా నీతివాచస్పతీ. 23

మ. జనుఁ డెవ్వాఁడు జనింపఁ డెల్లజనులు న్సంసారచక్రంబునన్
జననం బెత్తెడువారె కారె విను జన్మం బెవ్వఁడే నెత్తినన్
దనవంశంబు ప్రకాశ మౌ నతఁడు జన్మం బెత్తినాతండు పా
లవసంతోషితభూజనా సురభిమల్లా నీతివాచస్పతీ. 24

మ. అలరంగు త్తికిఁ బుణ్యశీలునకు యోగ్యస్థానముల్ రెండె సు
మ్మలరించు న్మటి రెండు నెవ్వి యనిన న్బ్రోంచెన్మహారణ్యమం
డలి యొండె న్ధరణీజనప్రవరచూడాసీమ యొండెం జుమీ
లలనానూతనమన్మథా సురభిమల్లా నీతివాచస్పతీ. 25

శా. లేరా వెండియు నేగు రార్గురు ఘను ల్నిం టన్నగరుం డాదిగా
వాని న్మస్తక శేషుఁ డయ్యెఁ జెనక న్వాంఛింపఁ డత్యంతశే
జోరాము ల్రవిచంద్రము ల్తగుదు రంచు న్రాహువే వ్యూహించి ప
ర్వారంభంబుల మార్కొనున్సురభిమల్లా నీతివాచస్పతీ. 26

మ. భువనశ్రేణి ధరించు శేషుఁడు ఫణాభోగంబుపై శేషుఁ గూ
ర్మవరేణ్యుండు భరించు వెన్నుపయిఁ గూర్మంబు న్వరాహంబు దా
ల్చు వరాహంబు నయత్నత న్జలధి దాల్చు న్విత్ర చిత్రంబు లీ
యవనిం బెద్దలవర్తన ల్సురభిమల్లా నీతివాచస్పతీ. 27

శా. నానాజ్వాలవిలోలవహ్నిరుచిసాంద్రం బై నదంభోళిచేఁ
దా నత్యంతము తండ్రి శీతగిరి సంత్రస్తాత్ముఁడై యుండఁగా
మైనాకాద్రికిఁ జెల్లునే యకట యాత్మప్రాణసంరక్ష యు
లా నక్కా జ్జలరాశిలో సురభిమల్లా నీతివాచస్పతీ. 28

మ. తనపై నయ్యరవిందబాంధవుఁడు పాదం బూనినన్వే యచే
తన మయ్యు న్వడిఁ జూపు మంట లినకాంతం బౌ నేజస్వి నా
జను లేరీతి సహింతు రన్యుఁడు తిరస్కారం బొసంగ న్విశా
లనయ శ్రీజితభార్గవా సురభిమల్లా నీతివాచస్పతీ. 29

మ. ప్రకటోద్దాంతమదార్ద్రమైనకరిణీఫాలంబుపై సింహ మ
ర్భక మయ్యుం దుముకు న్స్వభావ మిది శూరశ్రేణికి న్సత్త్వల
క్ష్మికిఁ బ్రాయంబులు గావు హేతువులు చర్చింప న్మదారాతిజా
లకజీమూతసమీరణా సురభిమల్లా నీతివాచస్పతీ. 30

---

## అర్థపద్ధతి

శా. పోవు న్జాతి యధోగతిం బయి కడు న్పోవు న్సదాచారస
ద్భావం బన్వయశుద్ధి నిష్ఫల మగు న్బాహాబలశ్రీ వృథా
భావం బొందు గుణానుభావము తృణప్రాయం బగుఁ నిర్ధనుం
డౌవాఁ డెన్నిట ముఖ్యుఁడా సురభిమల్లా నీతివాచస్పతీ.

మ. ధని యెవ్వాఁ డగు వాఁడె సత్కులుఁడు మేధాశాలి సర్వార్థద
ర్శనుఁ డత్యుజ్జ్వలమూర్తి యప్రతిమవాగ్జాలుండు సర్వజ్ఞుఁ డౌ

ననఁగా శోభిలు నెల్లసద్గుణము లర్థైకాశ్రయంబు ల్సుమీ
యనిశశ్రీజినావాసవా సురభిమల్లా నీతివాచస్పతీ. 32

మ. యతి సంగంబు సుపుత్రుఁ డిల్లు గృషి నవ్యాలోక మప్రీతి మి
త్రత లజ్జ స్సుర పుత్త్రుఁ గూర్మి పతి దౌర్మంత్ర్యంబు విశ్లేష మి
ష్టత దుస్సేవ బుధుల్ గునీతి సిరి వెచ్చం బరము స్వేదబా
హ్యాత విప్రు న్నెఱుచు న్గదా సురభిమల్లా నీతివాచస్పతీ. 33

మ. సరవి న్దానము భోగము న్మఱి వినాశం బన్నయిమ్మూఁడువై
ఖరుల న్మర్త్యులు సంతరించుధనసంఘాతం బపేతం బగున్
ధరలో నాద్యము లైనరెండువిధము ల్దప్ప న్దృతీయంబె యె
ల్ల రయర్థంబున కౌఁ జుమీ సురభిమల్లా నీతివాచస్పతీ. 34

మ. రతుల న్బాల కళావిశేషత నిశారా జీగి నర్ధాధ్యుఁ డు
గ్రతరా స్త్రక్షతి జోదు శాణకలన న్రత్నంబు దానాతిని
న్నుతి నేనుంగు శరత్కృశాంభమున నేరు న్శోభిలున్ జూడ న
ల్పత గన్పించియుఁ బెంపుచే సురభిమల్లా నీతివాచస్పతీ. 35

మ. తొలుతం జేరెఁడువడ్ల కేఁకరు దరిద్రుం డంత సంపన్నుఁ డై
యుల సర్వంబు తృణీకరించు ఘనము న్హానంబునుంగా గురు
త్వలఘుత్వంబులనిశ్చితంబు లగు చర్యశ్రేణి దోఁపించుఁ బెం
పలర న్దిష్టవిశేషము ల్సురభిమల్లా నీతివాచస్పతీ. 36

మ. భువి గోధేనువుఁ జేసి భూజనముఁ గ్రేవుం జేసి పోషించుభూ
ధవుఁ డేయిష్టము నేనియు న్బిదికిన న్దద్భూమి యయ్యిష్టమున్
సవిశేషస్థితి నిచ్చుఁ గల్పలతచందాన న్విషద్భూమిపా
లవనాభీలదవానలా సురభిమల్లా నీతివాచస్పతీ. 37

మ. నిజము న్బొంకును గ్రౌర్యము న్బ్రియము నెంతే వెచ్చము న్విత్తసం
భజనంబు న్మఱి హింసయు న్గృపయు లోభంబు న్వదాన్యత్వమున్
సృజియించు న్ధరయం దనిశ్చయగతిన్ జెన్నారు నవ్వేశ్యలీ
ల జనాధీశులనీతి శ్రీసురభిమల్లా నీతివాచస్పతీ. 38

శా. త్యాగంబు న్ద్విజరక్షణంబు స్వజన త్రాణంబు సత్కీర్తియున్
భోగం బాజ్ఞయు నాఁగ నాఱుగుణముల్ పొల్పొందవేనిన్ సిరో
ద్యోగుం డై భజియింపఁగా వలయు లేమన్న న్వృథా గాక యే
లా గోత్రాపతిఁ గొల్వఁగా సురభిమల్లా నీతివాచస్పతీ. 39

శా. దైవం బిచ్చినయంత గల్గు నడవి న్దైవాద్రి నైనన్ సదా
డై పిత్రార్యుల కింకర న్వలను తోయం బిట్టి ఘట్టుండదన్
బావి న్ముంచినఁ గుండ దేఁడు జలధి న్ముంప న్ఘటం బుండదున్ బట్టు నా
లావణ్యాపరమన్మథా సురభిమల్లా నీతివాచస్పతీ. 40

## దు ర్జ న ప ద్ధ తి

మ. కరుణాలేశము లేదకారణమె యుగ్రంబైన కోపం బిడున్
బరనారీపరవిత్తవాంఛితము లాత్మన్ నిత్యమున్ జేయు వే
మఱు విద్వజ్జనబంధుబృందము నలంపన్ జూచు నిప్పాటఁ గ
ల్లరి యారానిగుణం బగు న్సురభిమల్లా నీతివాచస్పతీ. 41

మ. బహువిద్యానిధుఁ డయ్యు దుష్టజనుఁ డెప్పాట న్విసర్జ్యుండు గా
ని హితుం జేసికొనం దగండు ఫణిమాణిక్యోజ్జ్వలం బయ్యు న
య్యహి సంత్యాజ్యమె కాని చేకొనఁగ సర్పంబే విభాస్వద్దయా
లహరీనిర్ఝరిణీశ్వరా సురభిమల్లా నీతివాచస్పతీ. 42

మ. ముని మూఢుం డను సిగ్గరి న్జడుఁ డనున్ బుణ్యవ్రతు న్దాంభికుం
డను శుద్ధుం గితవుం డనున్ స్థిరు నశక్తాత్ముం డను న్మంజువా
దిని దీనుం డను వక్తఁ బ్రల్లఁ డనున్ దేజస్వి గర్వాధికుం
డనుఁ గూ రెవ్వరి మే లను న్సురభిమల్లా నీతివాచస్పతీ. 43

మ. సుమహత్త్వంబె విభూష సజ్జనతయే చుట్టంబు కొండెంబె పా
పము లుబ్ధత్వమె దుర్గుణంబు చదువే భాగ్యంబు సత్యంబె స
ద్విమలం బౌ తప మాత్మశుద్ధియె మహాతీర్థంబు దుష్కీర్తియే
యమితక్లేశము దేహికి న్సురభిమల్లా నీతివాచస్పతీ. 44

మ. తొలుత న్దీర్ఘములై పిదం గృశములై తోఁచున్ బ్రభాతంపుఁ జా
యలుపోలెన్ ఖలుతోడి మైత్రు లపరాహ్ణచ్ఛాయలుం బోలెఁ దొ
ల్తొలుత న్స్వల్పములై పిదన్ఘనములై తోఁచు న్సుధీసఖ్యముల్
నలినాక్షీనవమన్మథా సురభిమల్లా నీతివాచస్పతీ. 45

మ. స్ఫురణ న్మానినసజ్జనుండు ధనలుబ్ధుం డైన రాజున్ నిర
క్షరుఁ డౌ రూపరి రచ్చలోఁ ఖలుఁడు నిష్పంకజంబు లౌ తోయముల్

తరుణత్వం బుడివోవునింతి పగ లల్పజ్యోతి యాచందురుం
డరయ న్మానసశంకువు ల్సురభిమల్లా నీతివాచస్పతీ. 46

మ. మొఱకై యెప్డుఁ బ్రచండకోపుఁ డగుచుం బోనాడుభూభర్త కొ
క్కురుఁ డాత్మీయుఁ డనం గలాఁడె సముదగ్రజ్వాల మహావహ్ని దు
ర్భరమై వ్రేల్చెడిహోత నైన స్పృశియింప న్నాల్గుఁ గాదే విశా
లరమావైభవవాసవా సురభిమల్లా నీతివాచస్పతీ. 47

మ. క్షమతో నుండ భయస్థుఁ డంద్రు కినియ న్గయ్యాళివాఁ డంద్రు మా
న మిడ న్మూఁగ యటంద్రు వాక్పటిమఁ జెంద న్వాదరం చంద్రు పా
ర్శ్వమున న్నిల్వ మదాంధుఁ డంద్రు కడ నిల్వ న్మోసమం డంద్రు శ
క్యమె భూపాలకసేవ దా సురభిమల్లా నీతివాచస్పతీ. 48

మ. సముఖానన్ జెడు గాడుఁ గాని యొరులన్ జాలింపఁ డుచ్ఛృంఖల
త్వమునన్ వర్తిలుఁ దొంటిపాట్లు మదిలోఁ దర్కింపఁ డొక్కింత భా
గ్యముచే నానదుమంత్రపుంబదవిచే గర్వించుభూపాలు మ్రో
ల మనం జూతురె పండితు ల్సురభిమల్లా నీతివాచస్పతీ. 49

మ. తృణవృత్తి న్జలవృత్తి నాత్మసుఖవృత్తి న్వర్తిలంగా మృగీ
గణముం జేపల సాధుల న్మృగయులు న్నైవర్తులున్ దుర్జనుల్
క్షణమాత్రంబు సహింప కేమిపనికై కారింతు రీధాత్రిఁ గీ
ర్త్యణుమధ్యావరణోత్సుకా సుగభిమల్లా నీతివాచస్పతీ. 50

---

## సుజనపద్ధతి

మ. ధనసంపత్తి మహేశభక్తి నిజశక్తి శాస్త్రాసక్తి విద్యానుర
క్తి మహత్సంగమవాంఛ దేశికవరాంఘ్రిప్రీతి దుస్సంగమో
క్ష మనిందామయబుద్ధి యన్యగుణహర్షం బేరియుం దుండు వా
రిమగన్ భూమి కలంకృతు ల్సురభిమల్లా నీతివాచస్పతీ. 51

శా. ఆపత్తిన్ధృతి సంపద న్క్షమ స్రుతి న్వ్యాసక్తి సద్గోష్ఠి వా
చాపాండిత్యము పోర విక్రమము భాస్వత్కీర్తిపై వాంఛయున్
రూపింప న్మహనీయు లౌ జనుల కెందు న్లక్షణంబు ల్సహి
యాపూర్ణప్రతిభానిధీ సురభిమల్లా నీతివాచస్పతీ. 52

మ. సిరి లేకైన విభూషితుండె యయి భాసిల్లున్ బుధుం డెట్లనన్
గురుపాదానతి కేల నీగి చెవులందు న్విన్కి వక్త్రంబునన్
సిరసత్సూక్తి భుజంబుల న్విజయము న్జిత్తంబున న్సన్నతో
హాగసౌజన్యము గల్గిన న్సురభిమల్లా నీతివాచస్పతీ. 53

మ. కలయ ట్లీవి పరాంగనాధనపరాకాంక్షత్వ మాచార్యవ
ర్యులపై భక్తిసధిప్రవర్తనము కారుణ్యంబు శీలంబు నా
ర్తుల రక్షించుట సర్వశాస్త్ర సముచిత్తుం డౌట తృష్ణాప్రవా
హలయంబున్ సుఖమార్గము ల్సురభిమల్లా నీతివాచస్పతీ. 54

మ. నవనీలోత్పలకోమలంబు లగుచు న్భాసిల్లు డెందంబు లా
ర్యవితానంబునకు న్సిరు ల్గలుగుచో నాపద్దశన్ బర్వతో
గ్రవిశాలోపలనిష్ఠురంబులగుచు న్భాసిల్లుఁ జుమ్మగ్రిమ
ల్లవ పీతానతశాత్రవా సురభిమల్లా నీతివాచస్పతీ. 55

మ. అసువు ల్వోవుతఱి న్సఖు న్సయితము న్యాచింపఁ డాపద్దశన్
విసువం డెత్తఱిఁ బాప మన్నఁ జొరఁ డెందే నల్పు న్యాయార్జనం
బు సదాచార మొనర్చు నీచ నడగ న్బోఁ డెందు నేర్చె న్ఘనుం
డసిధారావ్రత మింతయు న్సురభిమల్లా నీతివాచస్పతీ. 56

మ. ఒసఁగున్ గుప్తముగా గృహాగతుఁ బ్రియం బొందిందు మేల్చేసి మా
నసమేతుం డగు నన్యమేలు సభల న్వ్యాఖ్యానము న్సల్పుఁ బ్రో
న్నసమారంభము సిరిం బరుం డెగడఁ బోఁ డెచ్చోట నేర్చె న్ఘనుం
డసిధారావ్రత మింతయు న్సురభిమల్లా నీతివాచస్పతీ. 57

మ. అడఁగు న్గోయను తప్తలోహపతితంబై పద్మినీపత్రమం
దిడిన న్ముత్తెముభంగి నుండు మణియై యేర్పాటగు న్శుక్తిలోఁ
బడి యాందే ఖలమధ్యమోత్తములను న్బాటించు మే లిట్లనై
యడరున్ జుమ్ము క్రమంబుతో సురభిమల్లా నీతివాచస్పతీ. 58

మ. జనకు న్బ్రోచినవాఁడు పట్టి పతికి న్సంప్రీతి గావించునం
గన యిల్లాలు సుఖాసుఖంబుల సమాకారక్రియుం డాప్తుఁ డెం
దును మిత్త్రాత్ముల కిట్టి మూఁడు సుపహాలు లోకంబులోఁ జేసునున్
హానుమత్కేతన విక్రమా సురభిమల్లా నీతివాచస్పతీ. 59

మ. పరకార్యంబు లొనర్పఁగాఁ దనపను ల్పాటిల్లు నోర్వ న్బలో
త్తము లౌ మానుషుల పెంపులన్ బరచరిత్రల్ మెచ్చ నాశ్రయ మూ

చరితం బెన్నఁగ నెవ్వ రక్రము లయిన న్సర్వోన్నతత్వస్థితుల్
జరగుం దజ్ఞుల కెట్లొకో సురభిమల్లా నీతివాచస్పతీ. 60

---

## పరోపకారపద్ధతి.

శా. న్యాయం బొప్ప ఫలించియు న్మహిజము ల్నమ్రంబు లై కన్పడుం,
దోయంబు ల్గొనియు న్విమానముగ నుండు న్మేఘము, ల్మత్యున్నత
శ్రీయుక్తుం డయియు న్వినమ్రతఁ బ్రవర్తిల్లుం బుధుం, డార్యు లా
హా యీదృక్చరితు ల్గదా సురభిమల్లా నీతివాచస్పతీ. 61

మ. చెవికిం గుండల మొప్పుఁ గాదు శ్రుతమే, చేదమ్మికి న్కంకణం
బు విభూషాఢ్యము గాదు దానమె, మహి న్బుణ్యాత్ము నెమ్మేనికిం
బ్రవిలేపంబులు గావు సొమ్ము లుపకారప్రౌఢిమే, నిక్క మీ
లవితేంద్రాతిగవైభవా సురభిమల్లా నీతివాచస్పతీ. 62

మ. జలజాతంబులు వేఁడెనే రవి వికాసం బొందఁగాఁ జేయుఁ, గ
ల్వలు ప్రార్థించెనె చంద్రమామ యనువేలం బొప్ప రంజించు, లో
కులు లంచం బిడిరే తటి జ్జలము మేఘుం డిచ్చుఁ, బుణ్యాత్మకుల్
దలఁప న్విశ్వహితక్రము ల్సురభిమల్లా నీతివాచస్పతీ. 63

మ. తమయర్థంబు త్యజించి కూర్తురు పరార్థం బుత్తముల్, మధ్యముల్
తమయర్థం బఱుపుడఁ గూర్తురు పరార్థంబుల్, పరార్థంబు స్వా
ర్థముకై త్రుంతురు మర్త్యరాక్షసులు, వ్యర్థం బల్గి యన్యార్థముల్
సమయం జేయ మనుష్యులే సురభిమల్లా నీతివాచస్పతీ. 64

మ. సమయం బైన నొసంగు మేలెలుపు దోషంబుల్ నివారించు నొ
చ్చెము దాఁచుం బ్రకటీకరించు గుణము ల్చేడ్పడ్డవేళ న్విడం
డు మహామిత్రుని చంద మిట్టు లనుచు న్సూచించి రార్యోత్తముల్
సమగత్క్ష్మాతలశల్గునా సురభిమల్లా నీతివాచస్పతీ. 65

మ. మును తన్గూడినవీళ్ళకుం నిజగుణంబు ల్పాలి కిచ్చెం బాలు ప్రాఁ
గునెడ న్వాని నటించి యజ్జలము ప్రాఁగుం దానె తన్మిత్రనా
శనము న్గన్గొని వహ్నిఁ గూలఁ జనుఁ బా ల్శాంతం బొనర్చుం జలం
బనయం బిట్టివి సఖ్యము ల్సురభిమల్లా నీతివాచస్పతీ. 66

మ. ఒకచో వెన్నుఁడు పవ్వళించె నొకచో నున్నారు దైత్యేంద్రు లం
డొకచో శైలచయంబు నిల్చె నొకచో నుగ్రానలంబున్ బం
హాకము ల్వర్తిలె నెంత భారసహుఁడో హా ధన్యుఁ డౌ సింధుపా
లకుఁ డైశ్వర్యపురందరా సురభిమల్లా నీతివాచస్పతీ. 67

మ. మహి సర్వంబు ధరించుకూర్మపతిజన్మం బొప్పగు న్నిందటన్
గ్రహచక్రంబు భ్రమింపఁ జేయుధ్రువుజన్మం బొప్పగున్ బై నిజం
బహహా యన్యులు వ్యర్థపక్షుల జాండౌదుంబరాంతస్సలా
స్వహజాతాంతరితక్రిము ల్సురభిమల్లా నీతివాచస్పతీ. 68

మ. అమదుం డై కలుషంబు లేక దయ సత్యం బోర్పు సత్కీర్తి గ
ల్గి మహాత్త్వైన యొనర్చుచు న్స్వగుణము న్గీర్తింప కౌశం ద్యజిం
చి మహి న్వైరుల కైన మేలె యిడుచు న్శిష్టప్రియుం డై సుశీ
లమునన్ వర్తిలు జ్ఞాని శ్రీసురభిమల్లా నీతివాచస్పతీ. 69

మ. ఒరులందు న్గుణలేశ మున్న నది యోహో యంచుఁ గొండంతఁ జే
సి రహి న్జెందు మహోపకారముల రక్షించు న్జగం బెల్ల న
య్యురుపుణ్యామృతపూర్ణవాఙ్మనసకాయుం డుండు నొక్కొక్కఁ డి
ల్లరలోఁ బుణ్యశరీరి దా సురభిమల్లా నీతివాచస్పతీ. 70

## ధై ర్య ప ద్ధ తి

మ. మును రత్నంబులు వార్ధిఁ బుట్ట మది సమ్మోదాప్తియున్ జెంద దం
తనె హాలాహల ముద్భవిల్ల నగబృందం బార్తియున్ జెంద దె
న్నినకార్యంబు సుధార మాట నది జన్మింప న్జనెన్ సజ్జనుల్
పని యీడేఱక పోదురె సురభిమల్లా నీతివాచస్పతీ. 71

మ. పని గా నేరద టందుఁ బూనక వెఱం బ్రాపింతు రెంతే జనుల్
పనికి న్నేకొని విఘ్నలేశము జనింప న్మధ్యము ల్వీఁగి యం
తనె చాలింతు రనేకవిఘ్నతతు లుత్పన్నంబు లైన న్ఘనుల్
పని సాధింతురు పూనిన న్సురభిమల్లా నీతివాచస్పతీ. 72

శా. నేల న్మంజులశయ్యయందు నయినన్ నిద్రించు వేడ్కన్ స్ఫుర
చ్చేలం బేనియు బొంతయైని సరిగాఁ జింతించి పైఁ దాలుచు
న్శాలీయాశన మైనఁ గూర యయినన్ భక్షించు ధీరాత్ముఁ డే
లా లోఁగున్ సరసాగ్రణీ సురభిమల్లా నీతివాచస్పతీ. 73

మ. నయశాస్త్రజ్ఞులు తిట్టనీ పొగడనీ నానాఁటి కైశ్వర్యమ
క్షయమై పై వర్తిలనీ కరం బణఁగనీ కాయంబు వోనీ తిరం
బయి భాసిల్లఁగ నీ స్వధర్మము విడ న్వాంఛింప రత్యుత్తముల్
దయమానాక్షికుశేశయా సురభిమల్లా నీతివాచస్పతీ. 74

శా. ఏపుణ్యాత్ము నలంప లేవు మహి నెంతే నింద్రియారంబు లా
శాపాశంబులు రోషవహ్నిశిఖలున్ శ్యామాదృగస్త్రవ్రజం
బాపుణ్యాత్ముఁడె పో జగత్త్రయ మనాయాసంబున న్గెల్చువాఁ
డాపూర్ణప్రతిభానిధీ సురభిమల్లా నీతివాచస్పతీ. 75

శా. ధీమంతుల్విధిదుర్విపాకమున నార్తిం జెందియున్ ధీరతా
సామగ్రిం ద్యజియింతురే శిఖిశిఖాజాలం బధోగామి యౌ
నే మర్త్యుల్ తలక్రిందుగాఁ గొనిరయేనిన్ భాగ్యసౌభాగ్యలీ
లామందీకృతవాసవా సురభిమల్లా నీతివాచస్పతీ. 76

మ. తనసద్ధర్మముఁ దప్పకన్న గిరిమూర్ధం బెక్కి దేహంబు తు
త్తునియల్గా మహిఁ బడ్డ మేలె శిఖియందు న్జొచ్చిన న్మేలె పం
బినకాలాహిముఖాగ్నిఁ గే లొసఁగిన న్మేలే సుమీ యాజిఖే
లనగాండీవశరాసనా సురభిమల్లా నీతివాచస్పతీ. 77

మ. ఘన వహ్నిశిలము గల్గధీరులకు సింగంబు లశత ప్రాయముల్
వనరాసుల్ చిఱుగాలువల్ ఘనులు మాల్యంబుల్ మహోగ్రాగ్ని చ
ల్లనితోయంబు విషద్రవంబు సుధ శైలశ్రేష్ఠ మల్పోపలం
బనవద్యోదయభాసురా సురభిమల్లా నీతివాచస్పతీ. 78

మ. పయిపైఁ గొమ్మలు గొట్టిన న్మఱి యిగుర్పన్ జూడమా వ్రాఁకులన్
క్షయము న్బొందియు వెండియున్ గళలు గాంచ న్జూడమా చంద్రు నెం
తయు దైవం బనుకూల మౌఁ బ్రమద మొంద న్గాంతు మంచు న్ఘను
ల్భయము న్జెంద రొకప్పుడు న్సురభిమల్లా నీతివాచస్పతీ. 79

మ. తప మక్రోధత సౌమ్యత న్సిరి మహత్త్వం బోర్మి ధర్మంబు ని
ష్కపటత్వంబున బల్మి మానమున శాస్త్రశ్రీ వినీతి న్ధనం
బు పవిత్రార్పణ జ్ఞానలక్ష్మి ప్రశమస్ఫూర్తి న్సమస్తంబు శీ
లపరత్వంబున శోభిలు న్సురభిమల్లా నీతివాచస్పతీ. 80

---

## దై వ ప ద్ధ తి

మ. గురుఁ డాచార్యుఁడు, వజ్ర మాయుధము, లేఖు ల్సేన, పైదిక్కు శ్రీ
హరి, స్వర్లోకము పాళెపట్టు, ద్విరదం బైరావతం, బిట్టియ
గ్చెరు వౌసాధన ముండియు న్నహివుఁ డాజి న్బాఱు దైవంబు లే
కరయం బౌరుష మేప్పునో సురభిమల్లా నీతివాచస్పతీ. 81

మ. అశనాపేక్షఁ గరండమున్ గొఱికి డాయ న్మూషిక న్మింగి త
త్పిశితప్రాశనతృప్తమై యరిగె నెందేఁ బెట్టెలోఁ బాము త్రు
త్కృశత న్బాసి సుఖాసుఖంబులకు నుర్వి న్దైవమే కారణం
బశఠస్వచ్ఛమనోజ్ఞ శ్రీసురభిమల్లా నీతివాచస్పతీ. 82

మ. పడి యాశుక్రియ లేచు చెండుకరణి న్స్వాంగంబుఁ బ్రాపించియున్
వడి మైఁ గార్యము చక్కఁబెట్టుకొను విద్వాంసుండు మృత్పిండమ
ట్లడఁగు న్గాని యపండితుండు పతితుండై లేవఁగా లేఁడు త
ల్లడపా టొందుచు ధాత్రిలో సురభిమల్లా నీతివాచస్పతీ. 83

శా. ఎండన్ నెత్తితపింప బట్టతలవాఁ డెండే నిలన్ నీడఁ గా
ర్చుండన్ దాళవుజంబుక్రింది కరుగన్ బ్రోత్కంప మై దానియ
ప్పం డవ్వేళనె తెప్పున న్బడిఁ బడె న్భాగ్యంబు లో దుర్దశ
ల్దండం బాయునె డాఁగిన న్సురభిమల్లా నీతివాచస్పతీ. 84

మ. రవిశీతాంశుల కావిధుంతుదునిచే నారల్లు గన్న న్భుజం
గవిహంగద్విరదేంద్రబంధనవిధు ల్గన్గొన్న విద్వజ్జనుల్
భువిలో యాచకులై చరించెడివిధంబు ల్చూడ దైవంబె చా
ల వరిష్ఠం బని తోఁచెడి న్సురభిమల్లా నీతివాచస్పతీ. 85

మ. మహికి న్భూషణ మై మహత్త్వములకు న్సాటైనరశ్రేష్ఠునిన్
మహి నిర్మించి యనంతకాలము మనన్గానీఁడు లోకేశ్వరుం
డిహిహీ యంతవ నింతపెం పొసఁగఁగా నేలా వృథా గాక బా
లహరిద్వావాసమన్యుతీ సురభిమల్లా నీతివాచస్పతీ. 86

మ. ఉరుతేజోనిధిహేళి చంద్రపరిభుక్తోన్ముక్తమైనట్టియు
బరఖండంబె గ్రహించి వర్తిలుఁ బగ ల్పద్మారియు న్నేయిఁ గ్ర
మ్మఱ నేతెంచి గ్రహించుఁ దా నదియె యున్మాలిన్యము న్బాయ లే
దరయ న్వారలు సైతమున్ సురభిమల్లా నీతివాచస్పతీ. 87

మ. క్షితి మృత్యుంజయుసఁ శ్రితుం డయి సముత్కృష్టామృతస్థాన మై
సతతం బోషధినాథుఁ డై శతభిషక్సంసేవ్యుఁ డై యొప్పుచుం
గుతుకాధారుఁ డని రాజయక్ష్మ విడ దొందున్ దైవపాకం బన
ల్పతరం బేరికి శక్యమే సురభిమల్లా నీతివాచస్పతీ. 88

మ. అమలజ్ఞానుని వెఱ్ఱిదైవము పృథాయాసంబుచేఁ జిత్తదో
షము పొందించుట కాపద ల్సలిపిన స్వల్పంగని కల్పనా
శముసం దేం కలఁగునా యతండు నిస్సారంబు లౌస త్తశై
లమును న్వారిధులుం బలెన్ సురభిమల్లా నీతివాచస్పతీ. 89

మ. ప్రభు వా దైవము మేలు చేసినది దప్పున్ బాఱి హెచ్చబ్బునే
విభవం బాధ్యులఁ జేరినంతటనె ప్రావృడ్వారిదం బెల్లచో
నభివర్షింపఁగఁ జాతకంబునకు నాలైదంబుబిందు ల్గదా
లభియించు న్నొగి మెత్తిన న్సురభిమల్లా నీతివాచస్పతీ. 90

---

## కర్మపద్ధతి

మ. విధిచేఁ గాని సురత్తమంతనె ఫలావిష్కారదు ల్గారు త
ద్విధి యన్నేవే నియతక్రియాఫలదమూర్వి సత్ఫలం బన్నఁ గ
ర్మధురాయత్త మి పౌటఁజేసి భజనార్హం బౌచుఁ గర్మంబె య
త్యధికం బై ప్రవిభాసిలు న్సురభిమల్లా నీతివాచస్పతీ. 91

మ. అజు బ్రహ్మాండఘటాళి సల్ప ఘటికారాచార్యుఁ జేసెన్, వృష
ధ్వజు భిక్షాటనుఁ జేసె, సూర్యు భ్రమణవ్యాసంగిఁ గాఁ జేసె, నం
బుజనాభున్ వివిధావతారతరళాత్ముజ్ఞేసె, నక్కర్మ మా
ల్లజనశ్రేణి కలంఘ్య మా సురభిమల్లా నీతివాచస్పతీ. 92

మ. ఘను నల్పునిగా, వివేకి జడునింగాఁ, జెంత దూరంబుగా,
ననవద్యామృతము న్విషంబుగ, సఖు న్బాలిణాపహుంగా, నొన
ర్చు నహో కర్మము దాని మాని మఱి దుర్బుద్ధు ల్గుణౌఘోపలా
లనము న్గోరుదు రేలొకో సురభిమల్లా నీతివాచస్పతీ. 93

మ. శుభకర్మంబు కలంతసేపు దయిత ల్సద్ధాంతము ల్ఛత్రముల్
శుభబౌఘం బది దీఱిన న్సకలము న్సూత్రంబు విచ్చిన్న మై

# శృంగారశతకము

## స్త్రీప్రశంస

శా. శ్రీమత్సోమవతంసపంకజభవ శ్రీనాథుల న్నిత్యమున్
భామామందిరకుంభదాసుల నొనర్ప న్జాలె నేమేటిజో
దాహూనాంతుఁడు వాగగోచరచరిత్రాళిపవిత్రుండు పూ
ర్ణామోదం బొనరించుత న్సురభిమల్లా మానినీమన్మథా. 1

మ. కులుకుజ్జిన్నియ లోరలేసొగసుఁజూపుల్ కల్కిలీల ల్వగల్
పొలయల్క ల్భయము ల్ప్రియమ్ముగవచనంబుల్ వ్రీడయు న్హాసకం
దళము ల్గాఁగలసర్వభావములచేత న్గాదె చెల్వంపుఁజె
ల్వలు లోఁజేయుదు రెల్లర న్సురభిమల్లా మానినీమన్మథా. 2

మ. బొమ లాడించుచుఁ బ్రొద్దిఁ జూచిజిగిచూపు ల్నిద్దపున్ముగ్ధవా
క్యము లంతంతట నిబ్బితిం దొలఁకుహాసాంకూరముల్ మందయా
నము లొయ్యారము నిల్పుసంగతులతన్ సర్వాంగశృంగారమై
యమరు న్శౌర్యము నై తగు న్సురభిమల్లా మానినీమన్మథా. 3

శా. సారె న్నిగ్గున వ్రాలుచు న్బెళుకుచున్ సారె న్వెఱ న్దేలుచున్
సారె న్గోపముచే బొమ ల్ముడిపడ న్వర్తింపుచు న్బొల్చుత
న్వారత్నంబులదృగ్విలాసములచే నంబాధముల్ చల్లిన
ట్లై రాజిల్లుఁ జూమీ దిశ ల్సురభిమల్లా మానినీమన్మథా. 4

మ. అళుల న్మెచ్చనిసోగవెన్నెలలు ఫుల్లాబ్జంబులన్ నవ్వుక
న్నులు దంతావళికుంభలక్ష్మి గలచన్ను ల్చంద్రుని న్గౌమొగం
బులు సత్కాంచనకాంతి తీయపలుకు ల్పొల్పొందునితంబంబు బా
లలకు న్బుట్టనిసొమ్ములౌ సురభిమల్లా మానినీమన్మథా. 5

మ. నుడువ న్బోయిన నంతయు న్బొసగ సెచిందు న్జూచిన న్బెళుకులున్
బెడఁగుల్ ప్రోవగు సౌభాగ్యసమ్మిళితమై పెంపొందు మందస్మితం
బిడిన న్జెన్నుదలిర్చు నొయ్యఁ జన నెందే నింతికి న్వింతసొం
గడరున్ బ్రాయము వచ్చుచో సురభిమల్లా మానినీమన్మథా. 6

మారాళ్లప్తశుభాత్క్షురాళి సమమై మధ్యస్థత న్బొల్చునాఁ
గా రె ట్లేదు విచిత్ర మోసురభిమల్లా మానినీమన్మథా. 14

మ. ఘనతారాగ్రహబృంద మున్న మణివర్గం బున్న దీపంబు లు
న్న నిశానాయకుఁ డున్నఁ దమ్మి నెలి యున్నన్ వెండి యే మున్న నే
మనయంబు న్బ్రియభామినీ విరహితుం డైనానికి న్లోక మె
ల్లను జెంజీఁకటి గాఁ గన్గొనున్ సురభిమల్లా మానినీమన్మథా. 15

మ. కరయుగ్మంబులు పద్మరాగములు వక్త్రంబుల్ మనోహారిచం
ద్రకాంతంబులు దంతలంబులు మహానీలంబులు న్గావున
న్దరుణు ల్రత్నమయంపుబొమ్మలు సుమీ తథ్యంబుగా భోజతు
ల్యరసజ్ఞత్వసువిశ్రుతా సురభిమల్లా మానినీమన్మథా. 16

మ. గురుభారంబున వర్తిలు స్సాటువుఁ జన్గుబ్బల్ పదంబు ల్మనై
శ్చరభావంబున భాసిలున్ నిజము భాస్వద్భావము న్బొల్చి పా
ల్చు రహి న్వక్త్రసరోజము ల్గ్రహమయ ల్సవిష్మా విలీలాలకల్
హరపాదాంబుజభృంగ శ్రీసురభిమల్లా మానినీమన్మథా. 17

మ. అదిరా యెంత ఘనంబు జవ్వనిపిఱుం దౌరౌర పక్ష్మోజముల్
వదనం బర్ఘురె యంచుఁ జిత్తము వృథా వాదంబుచేత న్నపిం
పమ పుణ్యంబు లొనర్చువారికి మహాభాగ్యోపభోగంబు గ
ల్గదె పుణ్యంబు లొనర్చవలె సురభిమల్లా మానినీమన్మథా. 18

మ. కొమరుం బ్రాయపుఁజల్వ పున్బాగరు మేకొల్ప ప్రతాటోపసం
భ్రమముల్ చూపుచుఁ బొల్చుకాంతలయొయ్యారంబు ల్వీకాగ్రప్రదీ
పము లై రమ్యము లై మనోజు గెలిపింప న్బాటకాంద్రై సుభా
వ్యము లై చిత్రము లై తగు న్సురభిమల్లా మానినీమన్మథా. 19

మ. ప్రమదోద్దీపము లై క్రమశ్లథనసౌభాగ్యంబు లై ముగ్ధము
గ్ధము లై ప్రేమమనోహరంబు లయి కందర్పప్రకాశంబు లై
యమనోవాగ్విషయంబు లై సదనురాగార్ద్రంబు లై పూవుఁబోం
డ్లమృమూర్తుల్ చెలఁగు న్రతిన్ సురభిమల్లా మానినీమన్మథా. 20

---

## సంభోగవర్ణనము

శా. వాళీకాహితతీవ్రతీవ్రకరకాండశ్రేణికి న్జాటుగాఁ
గేల న్బయ్యెదకొంగు పట్టుకొని సంక్రీడించు నుద్యాన భూ

సాలచ్ఛాయల నిల్చుచున్ నిలుచుచుం జంద్రాస్య యొక్కర్తు శ్రీ
లావణ్యసుధాంబుధీ సురభిమల్లా మానినీమన్మథా. 21

మ. నిను వీక్షించినదాఁక ముచ్చటపడున్ వీక్షించి గాఢోపగూ
హనాలాభం బగుదాఁకఁ గోర్కిపడు గాఢాలింగనం బబ్బినన్
దనుమధ్యామణి మేనితోడ నిజగాత్రం బప్రభిన్నంబు సే
య వెదన్ గోరు జనుం డిలన్ సురభిమల్లా మానినీమన్మథా. 22

మ. మఱిఁ గాశ్మీరజగంధచర్చయు నిగం బ్రత్యగ్ర మాలాజిదం
డయుఁ బై యౌవనవంత యైన చెలియున్ భాసిల్లఁగా నాసుఖం
బ యిల స్వర్గము గాక మీఁద ననుశబ్దం బప్రమాణంబు సు
మ్మయ్యో భీరుమనస్క శ్రీసురభిమల్లా మానినీమన్మథా. 23

మ. తొలుత న్నేకాన కింతసేపు పెనఁగు న్దగ్గోడ నాసక్తిమై
సలుపు న్నిబ్బితి వల్చియు న్వలవమి న్స్వైరించి యంత న్రతిన్
దొలఁగించున్ బ్రియ ముప్పతిల్ల గతుల న్సొక్కించి యెంతే మనం
బలరించుం గులకాంత మే ల్సురభిమల్లా మానినీమన్మథా. 24

మ. తళుకుం జెక్కులు చెమ్మగిల్లఁ గచబంధం బూడి వ్రేలంగఁ దో
య్యాలి వుంభావ మొనర్చి బిట్టలసి నేత్రాంభోజము ల్మోడ్చి ని
శ్చలత న్వక్షముమీఁద వ్రాలినవుఁ డోష్ఠం బానుధన్యాత్ముల్
దలఁప న్భాగ్యఘనుల్ సుమీ సురభిమల్లా మానినీమన్మథా. 25

మ. ప్రమదావేశనిమీలితాక్షు లగుచు న్నాత్రిందివావారితో
ద్యము లౌచు న్నతి మేర లేనితమిచేఁ దర్పించుచున్ నిండు ప్రే
మ్మిమెయి న్సొక్కుచుఁ దేల్చు కేళికలె సుమ్మీ కామినీకామిజా
లముపాలింటికి బ్రహ్మము ల్సురభిమల్లా మానినీమన్మథా. 26

మ. జర గన్పించియు మానవుల్ మదనచేష్టల్ మాన లేకుండినన్
దరుణు ల్చన్నులు వ్రాలియు న్మదనతృష్ణ న్బాయ లేకుండినన్
బరమాత్ముం గడె యొఱుంగు నయ్యధికబీభత్సంబు నేఁ జెల్లనే
యరిరాడ్గర్వనివారణా సురభిమల్లా మానినీమన్మథా. 27

మ. అమితాశాజలరాశిలో మునిఁగి మర్త్యశ్రేణి యర్థార్జనో
ద్యమతం గ్రుమ్మరు నర్థ మేల యెలప్రాయం బెంతయున్ జన్నవె
న్క మనోహారిణు లౌ చెలు ల్పలితయుక్తాంగకము న్నె స్వగే
హముఁ జేరం జను నిక్క మౌ సురభిమల్లా మానినీమన్మథా. 28

మ. ఘనసమ్మోహాపదం బనేకనరకోగ్రక్లేశసంపాది రా
గనిజస్థానము జ్ఞానచంద్రజలదౌఘం బంగజన్మప్రవ
ర్తన మాపాదితదోషరాశి కౌమరుం బ్రాయంబ దుష్కార్యజా
లనిదానం బిదియే సుమీ సురభిమల్లా మానినీమన్మథా. 29

శా. శృంగారద్రుమనీరదంబు వితతక్రీడారసౌఘంబు త
న్వంగీనేత్రచకోరచంద్రుఁడు ప్రవీణాలాపగత్వాబ్ధి స
ర్వాంగశ్రీనిధి కామబంధు వెలప్రాయం బిందు ధైర్యంబు ని
ల్పంగా శక్తుఁడె యోగి యా సురభిమల్లా మానినీమన్మథా. 30

మ. బటువుంజన్నులు చందమామతళుకు ల్పర్విస్వానకాంచీలస
త్కటిలీల ల్గలజవ్వనుల్తవులు గాఁగాఁ గాక తత్త్వజ్ఞుఁడు
త్కటరాజన్యులపంచలం బడుచు నిస్త్రాణంపుసంసారప
ర్యటన న్గిడ్పడఁ జొచ్చునే సురభిమల్లా మానినీమన్మథా. 31

మ. ప్రియ మై సిదనిషేవ్య మై హరవృషక్రీడాంక మై గాంగతీ
రయుతం బై చలిగొండ యుండఁగనె చేర న్లేక తత్జ్ఞు ల్పరా
శ్రయదైన్యంబుల నుండు టెల్ల మృగచంచన్నేత్ర లౌమించుఁబోం
డ్లయొయారంబులఁ జిక్కి నూ సురభిమల్లా మానినీమన్మథా. 32

మ. అరవిందాక్షులు మేటిపెన్దరఁగల ట్లై యడఁగింపంగ దు
స్తర మై యుండెడుఁ గాక చుల్కన ధరించ న్రాదె సంసారసా
గర మేమాత్రపుదూరపార మిది లోకశ్రేణి చూడ న్మనో
హరసౌభాగ్యవిభాసురా సురభిమల్లా మానినీమన్మథా. 33

మ. మలల న్లేళవ నంది యీఁదగు శితాశ్మచ్ఛిన్నమూలంబు లై
యొలమి న్నొబ్భిలుదర్భపుంజములు కా దేనిన్ నఖచ్ఛిన్నముల్
తెలనాకు న్పశువు ల్వధూజనుల కంతే నంది యీయ న్దగున్
లలితాంతర్భవనంబుల న్సురభిమల్లా మానినీమన్మథా. 34

మ. గడు సౌఖ్యాకరుఁడు నిత్యమూష్య లనుచు న్గంజాక్షుల న్రోయని
వెడవాదంబుల కేమి నామదికి భావింప న్సతి న్బోల ని
ప్పుడమి న్గామితవస్తువు న్పరహితంబు న్బోలఁ బుణ్యంబు లే
దడర న్భోగపురందరా సురభిమల్లా మానినీమన్మథా. 35

మ. మది మాత్సర్యము మాని నిశ్చయగతి న్మాన్యు ల్విచారించి చె
ప్పుదు రిమ్మర్త్యుల కాశ్రయింపఁగ మహాభూభృన్నితంబాళి మం

చిది లేదేని వధూనితంబతలము న్సేవ్యంబు లంచున్ గిరీ
లదరాతీశ్వరవైభవా సురభిమల్లా మానినీమన్మథా. 36

మ. చలనప్రాయము స్వల్పసార మగుసంసారంబున న్బుద్ధిమం
తులకు న్రెండుగతు ల్సుమీ యుచితము ల్కాశ్యప్రబోధామృతో
జ్జ్వలసంసేచన మేని వృత్తకుచయోరషామాగేహసలీ
లలితస్పర్శన మేనియు న్సురభిమల్లా మానినీమన్మథా. 37

మ. నియతుండై జనుఁ డాశ్రయింపఁగఁ దగు న్విశ్వాసుసంహారి నై
నయమర్త్యాపగవారిచేరువల నైనన్ హారియు న్నిత్తహా
రియు నౌస్త్రీచనుదోయి నైన నిని ధాత్రి న్భారచేతస్సుఖో
దయసంసిద్ధికి హేతువు ల్సురభిమల్లా మానినీమన్మథా. 38

మ. విను మింక న్బెనుదోలి రిత్తచనువుల్ నేయేల నీవిశ్వభూ
జనసంఘంబునకు న్మథాలతసలస్సమ్ముగ్ధ కాంతానుయా
వన మైన న్గుమి యా వనం బయిన సేవాయోగ్యము ల్రెండు సు
మ్మనిశప్రాభవభాసురా సురభిమల్లా మానినీమన్మథా. 39

మ. నిజ మోహెలు నిజ మొక్కమాట యిదె విప్పింతు వ్యవహారంబు స
ర్వజగజ్జీవులకు న్మనోహరవయస్సంపన్నలైనట్టివా
రిజపత్రాక్షులె సుమ్ము సమ్మదము నార్తిం జేయువే హేతువుల్
భజమానార్యసురద్రుమా సురభిమల్లా మానినీమన్మథా. 40

---

## కామినీగర్హణము

మ. చనుబంతు ల్పిలుచుఁ ల్ముఖాబ్జము బొమ ల్సత్కాంతియు న్గన్నదో
యి నిరీక్షించి యశౌచపున్ప్రతిమ గంతే నాఁడఁ దాలిప్ నుతిం
చును సౌఖ్యం బ్రమియించు సంతసపడు న్సజ్జానిసైతంబు మో
హనివేశం బవురౌర శ్రీసురభిమల్లా మానినీమన్మథా. 41

శా. హృత్తాపం బొనరించు విన్న మఱి సంవీక్షించినన్ దద్దయున్
జిత్తోన్మాద మొనర్చు నంటెట సమాశ్లేషంబు గావించినన్
మత్తున్ జేయు మరాళయాన ప్రియ యన్వాక్యంబు లెట్లోర్కు వ
ల్గత్తేజీవ్రజధాటికా సురభిమల్లా మానినీమన్మథా. 42

మ. అమృతంబు న్విషము న్మెలంతయె సుమీ యారెంగు నెట్లన్న న
గ్రమున న్వర్తిలునంతసేపు నమృతాకారంబున న్గాంచు ని

క్కముగా దగ్గఱం బాసె నేని మఱి యుగ్రంబైనక్ష్వేళంబులీ
ల మది న్దాప మిడుం జుమీ సురభిమల్లా మానినీమన్మథా. 43

మ. ప్రమదం బప్పు నొకించుకిం తెనృతము న్వ్యాపింప దెంతే విషం
బమర న్బ్రోలదు రక్తిచే నమృతవ ల్లై చేర్చు నానాగతిన్
దమి లేమండినయంతనే విషల తై దారించు నిస్సారి యై
యమితోదార గభీర శ్రీసురభిమల్లా మానినీమన్మథా. 44

మ. గరువంబుం గపటంబు సాహసము దుష్కర్మం బవిశ్వాసమున్
దిర మౌవంచన సందియంబును మద స్వైరైన స్త్రీయంత్రమున్
నరకద్వారముఖంబు స్వర్గసుఖవిఘ్నంబు జ్జగత్పాళవ
ల్లరి నెవ్వాడు సృజించెనో సురభిమల్లా మానినీమన్మథా. 45

మ. కవు లొత్రింతురు గాక చందురుడె వక్త్రం బబ్జయుగ్మంబె క
న్గవ బంగారుసలాక నైనదియె త్వఙ్మాంసాస్థిరూపంపుమే
ను వితర్కింపఁగ దుర్వివేకిలు రహి న్భోగింత్రు రే లెల్ల నే
ల విమూఢాత్మకు లైరొకో సురభిమల్లా మానినీమన్మథా. 46

మ. అతి స్వాభావిక మైన రాగమున నాహ్లాదింపుదు న్వారిజం
బులయందు న్భ్రమియించుచందమున నమ్మూఢుండు పంకేజ నే
త్రలనైసర్గిక విభ్రమంబులఁ జేతః ప్రీతిఁ గావించి దా
నలరు న్నేరమఁ దేరగా సురభిమల్లా మానినీమన్మథా. 47

శా. రాకాశీతమయూఖలీల నమృతప్రాయుం బగున్ దొల్త నో
హో కాంతామణి మోము భూజనుల కత్యుల్లాసదం బౌచుఁ గిం
పాకక్ష్మాజఫలంబు కైవడి విషప్రాయం బగు న్బిమ్మటన్
వ్యాకప్తాసుఖ మౌచు శ్రీసురభిమల్లా మానినీమన్మథా. 48

శా. ఘోరం బై త్రివళీతరంగ మయి వక్షోజస్ఫురత్కోక మై
ధీరత్వద్రుమభంజి యై దగుసు గాత్రీనామ మౌనేట సం
సారాంభోధి మునుంగ నొల్లనిసుధీశాలు ల్ప్రవేశింప రు
గ్రారిస్తోమత మోరవీ సురభిమల్లా మానినీమన్మథా. 49

మ. అభిరామంబుగఁ జూతు రొక్కని మదిన్ ధ్యానింతు రొం డొక్కనిన్
నిభృతప్రేమనివేదితస్మితముల న్వేఱొక్కవిన్నాణితో
నభిభాషింతురు దుర్మతు ల్లలరుహాస్య ల్వారి కెవ్వాఁడు వ
ల్లభుఁడన్ దా ననువాఁడు శ్రీసురభిమల్లా మానినీమన్మథా. 50

మ. నవలాపల్కులఁ దేనె లుండు మదిలోన న్హాలకూటంబ యుం
డు విశేషజ్ఞుఁడు దానఁ జేసియె కదా నోరూరుచు న్మోవి గ్రో
లి వెస న్వక్షము ముష్టిఘట్టనలఁ దాడించు న్సదా కేళివే
ళ విపశ్చిత్సురభూరుహా సురభిమల్లా మానినీమన్మథా. 51

శా. కన్పించు న్విషమత్వ మేర్పడి కటాక్షంబు ల్విషజ్వాలలై
తనూపచక్కఁదనంబు పెన్పడగ యై తన్వంగి సర్పాకృతిన్
మాన్ప న్వచ్చు స్వభావసర్పవిషము న్సన్మంత్రము ల్వైద్యముల్.
మాన్ప న్లేవిది మూర్ఖున న్సురభిమల్లా మానినీమన్మథా. 52

మ. మఱు, డన్జాలరివాఁడు భూజనము లన్మత్స్యంబుల న్గాసురా
ధర మాంసగ్రథితంబు లౌనవల తాతన్వంగు ల న్గాలముల్
గరిమ న్సంసరణాబ్ధిలోఁ బఱపి యాకర్షించి రాగాగ్నిఁ బెం
పరుగ న్వేర్చు నజస్రము న్సురభిమల్లా మానినీమన్మథా. 53

మ. స్తనదుర్గంబులచే దురంత మగు కాంతాదేహకాంతారభూ
మి ననంగుం డనుదొంగ తావుకొని కామిశ్రేణిచిత్తవ్రజం
బను పాంథావళి నడ్డగించుకొని ధైర్యప్రౌఢి యన్విత్త మె
ల్ల నిమేషారములోఁ గొను న్సురభిమల్లా మానినీమన్మథా. 54

మ. చల లై వ్యాయత లై యరాళ మయి భాస్వత్తేజ లై భోగియై
నలు పై యొప్పెడుభామినీనయన మన్సర్పంబు మూర్ఖ్కన్న ప్రా
ణులకు న్వైద్యము లేదు గాని కల వెందు న్వైద్యము ల్తజ్ఞ్ఞ బి
ల్వాలు మూర్ఖ్కన్న జనాళికి న్సురభిమల్లా మానినీమన్మథా. 55

మ. సరసీజాస్యల మేలితావియుఁ గుచస్పర్శంబు వృత్తంబు నో
ష్ఠరసంబు న్మృదుగీతము న్గని యాసల్పాసి యాలోకులన్
బరమార్థంబు నెఱుంగలేని చెడుగు ల్పంచేంద్రియంబు ల్వారీ
హారి యొప్పింపఁ దొడంగెఁగా సురభిమల్లా మానినీమన్మథా. 56

మ. అమతి న్గన్నులు ద్రిప్పఁ జేయుఁ గడు నిం తౌ గాత్రభంగంబు వి
భ్రమవాక్యంబులు నెట్టుకొల్పు మదనాపస్మార మేశాంతి కూ
పము లేమంత్రము లేమహౌషధము లాపాదించిన న్మాన దు
ల్ల మలంచు న్జనకోటికి న్సురభిమల్లా మానినీమన్మథా. 57

మ. అవి వేన న్గడుఁ దైనఁ బం గయినఁ జీకైన న్మహారోగియై
న విమూఢాత్మకుఁ డైన రోయక మది న్మాకల్పలాభస్పృహన్

సువిలాసం బగుమే నొసంగునెలయింతు లౌభాగ్యలే జ్ఞానక
ల్పవనీవల్లి కుఠారము ల్సురభిమల్లా మానినీమన్మథా. 58

మ. ప్రవిలాసాకృతిసంపద న్ధరపయి న్భాసిల్లువేశ్యాజనం
బు వలత్కాముకకృశానుకీల లగుచు న్పొల్పొందుచు న్విత్తముల్
నవతారుణ్యములు న్విటాళి హుతము ల్గావించిన న్జేకొనున్
లవము ల్జక్కఁగ నీక శ్రీసురభిమల్లా మానినీమన్మథా. 59

మ. అలరు న్గాక మనోహరంబు లయి వేశ్యావక్త్రము ల్విటా
దు లనేకు ల్చవి గ్రోలి క్రోలి చనువ న్దూష్యంబు లైనట్టియెం
గిలిమోవి ల్కవి యేల ముద్దుగొనఁ దర్కించు న్గులసానముల్
గలచారిత్రఘనుండు శ్రీసురభిమల్లా మానినీమన్మథా. 60

## సువిరక్తదుర్విరక్తవర్ణనము

శా. పంచారించినగుబ్బచన్నుఁగవతో భాస్వద్వళు ల్మీఁదఁ గ
న్పించ న్బొల్చునలంతినెన్నడుముతోఁ బెంపొందులేఁబ్రాయపుం
మించుబోఁడిబెడంగుఁ జూచి మది గంపించంగ నీ కుండువాఁ
డంచద్ధైర్యఘనుం డిలన్ సురభిమల్లా మానినీమన్మథా. 61

మ. చెలువ ల్సల్పువిలాసదృష్టిరచన ల్చిత్తంబులో రోఁతగాఁ
దలఁచు న్గానలయందె కోర్కి యొసఁగు న్దా లౌల్యసమ్మోహముల్
దొలఁగించు న్తృణసన్నిభంబుగ జగత్తు న్జూచు వేఱొక్కఁ డై
యలరు న్శుద్ధవిరాగి శ్రీసురభిమల్లా మానినీమన్మథా. 62

శా. ఏలా చూచెద రుజ్జ్వలోజ్జ్వలము లౌ దృష్టు ల్పచారించి యీ
లోలాక్షు ల్చెడుజంతువు ల్మదనభల్లుం జేయుతీవ్రాస్త్రపుం
జ్వాల ల్పాంతము లయ్యె మోహ ముడిగెన్ నాకేల వీం డ్రింక నం
చాలోచించు విరాగి దా సురభిమల్లా మానినీమన్మథా. 63

మ. హరపాదాంబుజసక్తచిత్తు లగుసన్న్యాసు ల్పరికంపింతురే
తరుణు ల్నేర్పున నల్ల ముము లొలుకన్ దర్శించిన న్గాపవ
లురుతి న్గోవెల ప్రేలిన న్స్మరుఁడు దా గొడ్డేఱుచాపధ్వనుల్
శరమోక్షంబు నొనర్చిన న్సురభిమల్లా మానినీమన్మథా. 64

మ. హృదయంబు న్హృదయంబు సంగతము లౌ నేని న్వియోగంబు గా
దగియే దవ్వుల నుండిన న్మతి పహాధ్యానంబుతో నుండినన్

హృదయంబు న్హృదయంబు ఖిన్నగతు లౌ నేని వ్యయోగంబు సు
మ్మది ధాత్రీజనకోటికి న్సురభిమల్లా మానినీమన్మథా. 65

మ. అచట న్స్త్రీయని యింతన న్మదనబాణాపన్నుడై పోయె నే
ని చనన్గాఁ బని లేదు లేక నియతి న్జీవంబుతో నున్న ము
న్నె చనంగాఁ బని లేదటంచు మొయిలు న్వీక్షించి వైదేశికుం
డచలుండై వసియించు శ్రీసురభిమల్లా మానినీమన్మథా. 66

మ. కృపయున్ బ్రజ్ఞయు మైత్రియు న్నతులు గారే తత్సతీసంగమం
బుపయి న్లాలస లేక భంగురము లౌ పూఁబోండ్లపొందు ల్విమో
హపరు ల్మెత్తురు కాలుఁ డేచుతఱిఁ దోడై కాచునే వాండ్రచె
ల్వపుగుబ్బ లునితంబముల్ సురభిమల్లా మానినీమన్మథా. 67

శా. యోగాభ్యాసతఁ జిక్కి యాత్మయు మనం బుజ్జృంభిత మైత్రిచే
రాగిల్లంగఁ బోరింబోరి న్మునులను బ్రామారతిక్రీడ లే
లా గాఢ స్తనసంనిమర్దనము లేలా తన్ముఖాఘ్రాణ మే
లా గేయాదిక మేల శ్రీసురభిమల్లా మానినీమన్మథా. 68

మ. ఘన మోహానలశరాంధకారము మది న్దార్కొన్న నీలోక మె
ల్లను నారీమయ మై కనంబడు విశాలం బౌనివేకాంజనం
బున నంతంతటఁ జూచి సాగిన జగంబు ల్బ్రహ్మరూపంబు లై
యనఘశ్రేణికిఁ గన్పడు న్సురభిమల్లా మానినీమన్మథా. 69

మ. గుము లై రచ్చలలోనఁ గూడుకొని యుక్తు ల్చెప్పఁగా నేమి శా
స్త్రము లెల్లం బఠియించినట్టిచతురు ల్సైతంబు కాంతామణీ
రమణీయేక్షణముల్ పయి న్బడినమాత్ర స్రోత లై (పోను) రు
ల్లము తేతెయ్యలు సల్పఁగా సురభిమల్లా మానినీమన్మథా. 70

మ. ఆమతు ల్కొండఱు గొన్నిశుష్కనిగమవ్యాఖ్యానము ల్నేర్చి సం
గము చీచీ కను దుష్కృతం బనుచు వక్కాణించు టే కాని ర
మ్యమణిప్రాంచితకాంచికాన్వితనితంబాభోగ యౌకాంత ను
ల్లములో నేమఱ వందు రో సురభిమల్లా మానినీమన్మథా. 71

మ. సకియ ల్నింద్య ల టంచు పట్టివెడనిష్ఠ ల్బ్రౌపుపాషండు లా
గక తాము న్జెడి లాఁతిని న్జెఱుచునిర్భాగ్యు ల్సమీ యధ్వరా
దిక పుణ్యంబుల కెల్లఁ బ్రాప్యఫలము ల్దివ్యాంగన ల్గారె స్త్రీ
లకు నింద్యత్వము గల్గునే సురభిమల్లా మానినీమన్మథా. 72

మ. మృగరాజు న్నగరాజుఁ గుంభి మఱి గింబిం ద్రుంచి తూటాడుచు
త్వగరిష్ఠు ల్గల రింతె కాని స్మరదోర్దండావలేపం బడం
పుగుణోదగ్రుఁ డొకండు లేఁడు బలిమిన్ మోమోడ కిబ్భూమి బ
ల్మగ లెల్ల న్వినఁ జెప్పెద న్సురభిమల్లా మానినీమన్మథా. 73

శా. ఆచారంబు జితేంద్రియత్వము విధేయత్వంబు లజ్జాగుణ
ప్రాచుర్యంబును నామనష్టము లగు న్బత్ష్మాంకితంబు ల్దృఢ
భూరిచాపచ్యుతముల్ శ్రవఃపథగతంబు ల్త్వద్విదృగ్బాణముల్
క్రౌంచ జ్ఞాగినయంతలో సురభిమల్లా మానినీమన్మథా. 74

శా. ఇత్తన్వంగులఁ గాదనం గలుగువారే తక్కొరు ల్వారు ప్రో
న్మత్తప్రేమవిహార లై సలుపుకర్మంబు ల్త్రిలోక క్రియా
యత్తుం డైనవిధాత్రుఁడు న్నయితము న్వ్యావృత్తము ల్సేయ లేఁ
డాత్తాశేషసుధీజనా సురభిమల్లా మానినీమన్మథా. 75

శా. అంగంబు న్విషమాస్త్రపావకసముద్యజ్జ్వాలిక ల్గాల్చుదాఁ
కం గానంబడుఁ గాని యంతటను జీకా కై చను న్వేగ పెం
పుం గీర్తింపఁగ నావలీనతయు న్నేర్పు న్బ్రిజ్ఞయు న్బంతముల్
సంగీతాగమదోహలా సురభిమల్లా మానినీమన్మథా. 76

మ. నిరయద్వారకవాటపాటనముపాంశుం బొల్చుబల్కుంచికల్
తరుణీభూరిలత లంచు నెంచుఘనబోధస్వాంతుఁ డొక్కొకఁడు డి
దర సంసారులలోపలం గలఁడు శాస్త్రజ్ఞానపారీణుఁ డె
ల్లరలో సద్గతిపాత్రుఁ డై సురభిమల్లా మానినీమన్మథా. 77

మ. అతిదీనంబు విలూనవాలము వికర్ణాగ్రంబు పూయవ్రణాం
కితగాత్రంబు గళేకపాలము క్షుధాఖిన్నంబు ఖంజంబు జీ
ర్ణతమం బంధము నైన వేఁపి శునివెంట న్గుక్క భోగార్థ మై
యతనుం డెవ్వరి నొంచఁడే సురభిమల్లా మానినీమన్మథా. 78

మ. సకలార్థప్రదల న్సవ్యాముద్ర లగుచంచన్నేత్రల న్రోసి తూ
హాదు లై తుచ్ఛఫలారు లౌ జనులఁ బుష్పాస్త్రుండు ద్వేషించి న
గ్నులు న్బంచశిఖు ల్జటాభరధరు ల్కాపాలిక ల్భ్రష్టు లై
యకటా భ్రమ్మఱఁ జేయుఁగా సురభిమల్లా మానినీమన్మథా. 79

మ. రమణీబృందముఁ జూచి వాయుజలపర్ణగ్రాసు లౌగాధిపు
త్రిముఖు ల్త్రైనతము పాలుమాలిరీ పయోదధ్వాజ్యశాల్యన్నతో

గమునం బ్రౌఢవ్వనరు ల్జితేంద్రియు లనంగాఁ జెల్లునే వింధ్యశై
లము పాథోనిధిఁ దేలునే సురభిమల్లా మానినీమన్మథా. 80

## ఋతువర్ణనము

మ. దయితాలి న్నిగిగాడ్పుల స్వలవు లందంబై చెలంగు న్వన
ప్రియనాహావళి పల్లవోజ్జ్వల మగు న్వృక్షాళి భామాస్యపం
క్తి నొసంగు న్విరళ శ్రమాంబుకణయుక్తి న్స్వేదము న్సద్గుణో
దయత న్భాసిలు నామని న్సురభిమల్లా మానినీమన్మథా. 81

మ. విరహిశ్రేణికిఁ బ్రాణసంకటము గావించె న్వసంతంబునన్
సరసం బౌపికభామవిరుతము న్మందానిల వ్రాతమున్
ధర నాపుష్పలస న్మధురసము న్హైతంబు న్విషంబే కదా
యరిరాడ్గర్వభాళ శ్రీసురభిమల్లా మానినీమన్మథా. 82

మ. ననవంశ ల్సిగఁ జుట్టి పూవుఁబోదరిండ్ల న్సత్కృపు ల్గొల్వఁ జెం
త నెలంత ల్కిలికించితంబు లిడుచు న్వర్తింపఁగా వెన్నెలల్
చినుకంగాఁ బికభామిను ల్చెలఁగఁగా శృంగార మాచైత్రనే
శను ధన్యు ల్విహరింతు రా సురభిమల్లా మానినీమన్మథా. 83

మ. విరహస్త్రీనిరహానలాహుతికళావిష్కార మై మాతమం
జరు లొప్పన్ బికగేహినీహితము లై చైత్రంబునన్ బాటలా
పరమామోదకదంబసంభృతము లై ప్రశ్రాంతిఘర్మాంబువుల్
హరియించు న్మధుగాలువు ల్సురభిమల్లా మానినీమన్మథా. 84

మ. సుదతు ల్మోవులు జేవుటంప సెమలొంచు న్మార్గ్రపాణేశులన్
జెదరింపంగ నొసంగినట్టి యలుక ల్చెదిల్ల కట్టుండు న
న్మదసంవర్ధనచందనద్రుమసుగంధక్లిన్న మాచైత్రఖే
లదణీయఃపవనంబు రా సురభిమల్లా మానినీమన్మథా. 85

శా. లీలాకంపనబాలచూతసుమపాళీకేసరాళీసము
న్మిలత్సౌరభవాసితాఖిలవనాంతంబు న్రోచ్యతస్మంద
దాళీలభ్రమరాళ్భటీముఖరితం బౌ రా వసంతంబు రా
గాలంబం బయి భాసిలున్ సురభిమల్లా మానినీమన్మథా. 86

మ. అల గ్రీష్మర్తువునన్ సుగంధగసపూర్ణారార్ద్రార్ద్రవత్సోజ లా
వణిదేహు ల్మలయానిలంబు ధవళం బౌహార్మ్యశృంగంబు వె

న్నెల ధారాగృహము ల్ప్రసూనములు సందీపింపఁ జేయు న్నరున్
లలితోత్సేకవికాశము న్సురభిమల్లా మానినీమన్మథా. 87

మ. జలకేళిశ్రమ మేఁగ కీఘురస మాస్వాదించి సూక్ష్మాంశుకం
బులు పూదండలు దాల్చి చంద్రకిరణంబు ల్పర్వుసౌధంబుపైఁ
జెలువ ల్సీవిరు లేయఁ జందనరసస్నిగ్ధాంగు లై గ్రీష్మవే
ళల ధన్యు ల్విహరింతు రా సురభిమల్లా మానినీమన్మథా. 88

మ. అమలజ్యోత్స్న సుధావదాతశుభగేహంబు ల్ప్రియావక్త్రప
ద్మము శ్రీగంధరసంబు ఘు మ్మనువిరు ల్తద్గ్రీష్మసౌఖ్యంబు రా
గిమనఃక్షోభము సేయుఁ గాని ప్రవిరాగిస్వాంత మిం తైన శా
ల్యము నొందింపఁగ లేవయా సురభిమల్లా మానినీమన్మథా. 89

మ. ధృతపీనోన్నతిమత్పయోధరభరశ్రీ యై నవోజ్జృంభమా
లతికాజాతిసుగంధి యై ఘనతటిల్లాలిత్యవిస్తార యై
సతతోద్దీపితకామ యై యలరువర్షావేళ రంజించుఁ జె
ల్వతెఱం గేర్పడి ధన్యుల న్సురభిమల్లా మానినీమన్మథా. 90

మ. అవిరామంబుగ వర్తిలు న్నటజనీపామోదు లాగాఢపుల్
నవకేకివ్రజకేకలంబు లగుకాన ల్కందళీచ్ఛన్న యా
భువియు న్గార్స్నగు లల్లుకొన్నగగనంబు న్నిత్తడి న్బ్రాణిజా
లవికారైకపదంబు లై సురభిమల్లా మానినీ మన్మథా. 91

మ. భువి దర్శించినఁ బాండుకందళచయంబు ల్దోఁచు దిజ్మండలం
బు విలోకించిన బర్హినాట్యరుచిరంబు ల్శైలము ల్వాపదున్
దివిఁ గన్గొన్న మెయిల్లు గాన నగు నర్కన్వాంగుఁడిం కెందుఁ దా
నవలోకం బిడువాఁ డొకో సురభిమల్లా మానినీమన్మథా. 92

మ. మెఱుపు ల్పారె తటుక్కు మంచు మెఱయ న్మిం డై పయోదధ్వనుల్
నెఱయ న్ఘుమ్మనుక న్నెగేఁగివిరు ల్చేతోభవు న్బిల్వఁగాఁ
బఱచు న్నెమ్ములు గూయఁగాఁ గటకటా ప్రావృడ్దినం బెంత యు
క్కఱఁ జేయు న్విథికొంగినన్ సురభిమల్లా మానినీమన్మథా. 93

శా. ఏపై చీఁకటి నూది మోప నెడ యీ కేర్పడ్డవేళ న్ధ్వనుల్
చూపట్టు న్నిటిపాట్టిన్కుల ఘనాళు ల్మింట వర్తిల్లఁగా
నూశించు న్నెలఁగు న్గలుక్కునఁ గటీత్తు ల్దోఁచిన న్బల్ల వే
ల్లా భుగ్నత్త్రై నరించ్ఛుదన్ సురభిమల్లా మానినీమన్మథా. 94

మ. జడి యట్టిట్టు చనంగ నీ కఱుమ నాసాగ్రంబు కేశ్రమం
బడఁప న్నీతున కల్కివల్లభులు గాఢాశ్లేషల్ సల్పఁ బ
ల్విడి సంక్రీడ లొనర్చుభోగినుల పర్వి స్ఫూర్తిసంబు న్సుఖం
బడరించు న్నదిసంబ యై సురభిమల్లా మానినీమన్మథా. 95

మ. అమలాత్మాంతకు శరద్విభావరుల హర్మ్యాగ్రంబుల న్నావదుమ
స్యమదోన్మత్తతఁ గొంతసేపు శయితుండై లేచి సంభోగజ
శ్రమతృష్ణ న్దయితారతిశ్లథకరాంచత్కర్కరీప్రస్తుతో
యము లాను న్శుచివారము న్సురభిమల్లా మానినీమన్మథా. 96

శా. నే పాలించు భుజించి లోగృహములో నిద్రించు ధన్యుండు పీ
టీపూర్ణాననుఁడై కుసుంభమయశాటీచ్ఛన్నుఁడై పంకమా
లేపప్రోజ్జ్వలుఁడై ప్రియాపృథుకుచాశ్లిష్టాంగుఁడై కంతుఖే
లాపర్యాసితుఁ డౌఁ జలి న్సురభిమల్లా మానినీమన్మథా. 97

మ. అనుఁగుఁజెల్వలఁ బాసిన న్గడచునే యాయామయామావనీ
ఘనసాంద్రప్రచలద్ద్విరేఫము స్ఫుగద్గంధప్రియాంగుప్రజం
బును బ్రాలేయమరుద్విలోలితవనాభోగంబు నౌ శీతవే
ళనిశ ల్కాలగృహోపమ ల్సురభిమల్లా మానినీమన్మథా. 98

మ. అలరుంజెక్కులు చుంబనం బిడఁ గుచవ్యాప్తంబు లౌ స్త్రీముఖం
బుల సీత్కార మెసంగఁ జేయు ఆవిక లొప్పేనోత్తమ న్గుబ్బలన్
బలక ల్పించుఁ బిఱుందున న్మృదుపటంబు ల్దార్పు నూఁపు న్దొడల్
చలిగాడ్పు ల్విటులట్లనై సురభిమల్లా మానినీమన్మథా. 99

మ. చలిగాడ్పు ల్సగలున్నలైన జెలులప న్వాసోంచలాకర్షణం
బులు దృక్కజ్జలనము త్తనూచలనంబు ల్కాంతకాలోలనం
బులు బింబాధరబాధసీత్కృతిచయం [illegible] ప్రరోమాంచము ల్
గలుగ న్జేయు నజస్రము న్సురభిమల్లా మానినీమన్మథా. 100

మ. సతులు న్దామును వీడెము ల్సలుపుమ న్సంభోగము ల్సేయు చు
న్నతఱి న్నైరరాత్రి వేగఁ జను నా[illegible]త్రి స్విష్టలన్ బ్రోదుసం
తతఖేదంబునఁ గూర్కు పట్టక మది న్వ్యా[illegible]మై వేదన్యుఁ గా
యత నై యెంతట వేగదౌ సురభిమల్లా మానినీమన్మథా. 101

శృంగారశతకము సమాప్తము.

---

# వైరాగ్యశతకము

## తృష్ణాదూషణము

శా. శ్రీమచ్చంద్రకళాకలాపశిఖమై శ్రేయోదశాగ్రస్ఫుర
ద్ధామం బై ప్రవిలోలకామశలభాధ్వఃకారియై యాంతర
వ్యామోహోరుతమోహరం బగుశివాఖ్యజ్ఞానదీపంబు సొం
పై మీకు న్మహి మీవుత న్సురభిమల్లా వైదుషీభూషణా. 1

మ. సుమహారణ్యసుదూరదేశగతుఁ డౌచున్ గాకిభంగి న్దుర
న్నము లందందు భుజించుచుం దిరియుచు న్జాత్యల్పులం బెక్కుగా
లము గొల్చున్ నరుఁ డేమియుం దొరక దేలా యెప్పుడు న్బాయ దు
ల్లములోఁ బాపపుఁదృష్ణ దా సురభిమల్లా వైదుషీభూషణా. 2

మ. ఇల ద్రవ్యున్ నిధివాంఛ ధాతువితతు ల్ధ్మామింప నూఁదు న్మహీ
శులఁ గొల్చున్ నరుఁ డోడబేరము గమించు న్మాంత్రికుండై నరేం
ద్రులభూమి న్బనుఁజీఁకటి న్గొంగు నెందు న్గడిక్కైనన లే
దలదు న్వెండియుఁ దృష్ణ దా సురభిమల్లా వైదుషీభూషణా. 3

మ. తనుఁ బోనాడిన నుత్తరం బిడక యంతర్వ్యాప్తుఁడై యూర కుం
డు నగు న్మాన్యమనస్కుఁడై ధనమదాంధు ల్మెచ్చఁ గేల్మోడ్చు భూ
జనుఁ డోహోహో నేలు వృథావిడంబ మగు తృష్ణంజేసి యేయేనిఖే
లనము ల్సల్పు నొకో యిఁక న్సురభిమల్లా వైదుషీభూషణా. 4

మ. అమతు ల్తామరపాకుమీఁదిజల మెట్ల ట్లైనయూరోఁతప్రా
ణముకోసంబు ధనాంధచిత్తులకడ న్సంకోచ మింతైన లే
క మహాపాతకమైన యాత్మనుతియు న్గావింతు రింకేమి సే
య మది న్గోరదు తృష్ణచే సురభిమల్లా వైదుషీభూషణా. 5

మ. క్షమ లేకున్కిలి దాల్మియు న్నివసదాస్వాదంబు లేకున్కి ధ్యా
నము సంతోషము లేక యున్కి సుఖసన్న్యాసంబు యోగానుభా
వము లేకున్కి హిమాతపాదిసహనత్వంబుం జెడు న్యోగికృ
త్యము లయ్యు న్ఫలహీనత న్సురభిమల్లా వైదుషీభూషణా. 6

మ. తపము న్దప్తము గాదు భోగమును భుక్తంబౌట లే దాయువుం
క్షపితం బైనది గాదు కాలమును జీర్ణంబౌట లేదెప్డు మా
ని ప్రజల్ తప్తులు భుక్తులుం క్షపితులు న్జీర్ణాంగులన్ దామె న్యై
యపటుత్వంబువహింతు రౌ సురభిమల్లా వైదుషీభూషణా. 7

మ. మొగ మెల్లన్వళిపూర్ణ మైనయపుడు న్మూర్ధంబున న్జర్వనా
రగతిన్ బాండిమ యల్లుకొన్నపుడు గాత్రంబు న్జరాక్రాంత మై
మిగుల న్సత్తువఁ దప్పినప్పుడును భూమిన్ నిత్యకామార మె
ల్లగునో మర్త్యులతృష్ణను న్సురభిమల్లా వైదుషీభూషణా. 8

మ. బహుమానస్థితి దూలె భోగసుఖ లీప్స ల్డప్పెఁ బ్రాణంబువం
టిహిత శ్రేణి యొకండు లేక యరిగె న్దృష్టుల్ ప్రార ల్గప్పెఁ బ్ర
త్యహము న్యష్ట్యభిలాషి యన్యో గమనం బ ట్లయ్యెఁ బాపంపుమే
నహహా తృష్ణఁ దొలంగ దౌ సురభిమల్లా వైదుషీభూషణా. 9

మ. అగు సంసిద్ధి విమోహావర్తము తృష్ణాలీతరంగంబు రా
గగురుగ్రాహము దుర్మనోరథజలాక్రాంతంబు చింతాఖ్యతీ
రగరిష్ఠంబు వితర్కపక్షికము ధైర్యక్ష్మాజభంగ ప్రవం
బగు నాశానది దాఁటినన్ సురభిమల్లా వైదుషీభూషణా. 10

---

## విషయపరిత్యాగవిడంబనము

మ. పస సంసారమునందు లే దొకటియు న్భావించి చూడంగఁ బు
ణ్యసముల్లాసము నార్తిదంబ యది యెట్లన్న న్స్వకర్మంబులన్
బ్రసభప్రాప్తము లై భుజింపఁబడుఁ దన్మాత్రంబు లాత్మేంద్రియ
వ్యసనాపాదకము ల్గదా సురభిమల్లా వైదుషీభూషణా. 11

మ. నిల కన్నంటికి నైనఁ బోవు విషయానీకంబు దా మై జనుల్
దొలఁగ న్లేరు తమంతట న్దొలఁగినన్ దోడ్తో శమానంద మ
గ్గల మై చేయుఱువేళ నవ్వియె దొలంగ న్నేఁటికిం దప్పి య
ల్లలనాఁడు న్మది ఖిన్న మై సురభిమల్లా వైదుషీభూషణా. 12

మ. అనఘాత్ముం డెటువంటిదుష్కరకరుం డత్యంతము న్బ్రోసి చెం
దినభోగంబులె సన్న్యసించు నిపు డేని న్దొల నేనిన్ బరం
బున నేని న్దమమున్ లభింపనిస్పృహాభోగంబులు న్మాన లే
రనయంబు న్విడువారు శ్రీసురభిమల్లా వైదుషీభూషణా. 13

శా. ఆనందాశ్రులు గ్రోలుచు న్పులకలంకారాగ్రంబులం దాఁడఁగా
ధ్యానారూఢత నుండి సద్గుహల నన్యాత్ముం డౌయోగి యా
ప్రాణాంతంబు ఘనోగ్రధీరుచితసౌధారామకేళీరతిన్
ధ్యానించున్ బెటువాఁడిల న్సురభిమల్లా వైదుషీభూషణా. 14

మ. అకటా మోహము వోదు సంధిలశయుండై శిరసాహారవుం
బికిరం బెత్తి చతుర్గవేళ దినుచు న్వేనూలజీర్ణంపుఁ బే
లికల నుట్టినఁగాఁత గప్పుకొని వాలి న్వాసి వర్తించున
య్యాప నైతంబు జగంబున న్సురభిమల్లా వైదుషీభూషణా. 15

మ. మొగముం జీమిడిగట్టి యిందువిక్రియం బోల్పొందునే రోఁతప
ట్లగుపూఁబోఁడ్ల నితంబముల్ కరటికుంభాభంబులే కాచుదో
బ్బగుదుల్ చన్నులు హేమకుంభములవలె భీభత్సం బిసీ రోఁత లే
ల గరిష్ఠంబుగ నెంతురో సురభిమల్లా వైదుషీభూషణా 16

మ. ఉమ సామేన వసించినట్టియభవుం డొక్కండు పెన్నాగి బా
ల్యమునందుండి యసంగుఁ డౌజనుఁ డొకం డత్యంతనీరాగుఁ డు
గ్రమనోజాహివిషార్తు లన్యు లుభయభ్రష్టు ల్సుమీ యందఱున్
గ్గమనిర్ముక్తభుజాబలా సురభిమల్లా వైదుషీభూషణా. 17

మ. దుముమ వ్వహ్నిశిఖాళియందు శలభస్తోమంబు మీనంబు గా
లము గ్రింగున్ మది బుదిలేక మనుజుల్ తత్త్వజ్ఞులయ్యు న్విషా
దమునన్ గ్రుంగుదు రింతె కాని విషయత్యాగోత్సవ ల్గారు శ
క్యమె మోహంబు తరింపఁగా సురభిమల్లా వైదుషీభూషణా. 18

శా. ఆనుం దప్పి జనింప స్వాదుశిశిరం బౌవారి భక్ష్యాన్వితం
బౌనన్నంబు దిను న్బుభుక్ష వొడమ న్శ్యామాతతి న్పొందు గా
ఢానంగానల మేర్చ నిట్టిది సుఖంబా రుక్ప్రతీకార మ
జ్ఞానికంబు సుఖం బను న్సురభిమల్లా వైదుషీభూషణా. 19

మ. తనవు న్సంపద మెండు భార్య ఘనసౌందర్యాంగి తారుణ్య మెం
న్న నవీనంబు సుతు ల్ప్రశస్తు లనుచు న్వ్యామోహి సంసారకా
ర నడంగు న్నిర మంచు భ్రాంతుఁ డయి సర్వం బధ్రువం బంచు మో
హనివృత్తిం జను జ్ఞాని దా సురభిమల్లా వైదుషీభూషణా. 20

---

## యాచ్ఞాదైన్యదూషణము

శా. వాపోచు న్క్షుధఁ గుందె చాల సుతు లవ్వా బువ్వ బువ్వంచు ని
ల్లాపె జీర్ణపటాపకర్షముల నుద్గాడింపగాఁ జూచి కా
కాపన్నుండు మనీషి భీతిని పరం బౌ దేహి యన్వాక్యమే
లా పల్కుం దనపాటకై సూరిభిమల్లా వైదుషీభూషణా. 21

మ. సగుణానద్గుణపద్మచంద్రరుచి లజ్జానూత్నవల్లీసమూ
హద్విపోదగ్రపరశ్వధంబు కదా నుద్యన్మానపిచ్ఛేదనం
బిది పూరింపఁగా రాదెబాన నరు సేమ్యేశులం ద్రిప్పఁ జా
లదు దుర్భాగవిడంబమై సూరిభిమల్లా వైదుషీభూషణా. 22

మ. ఒకపుణ్యాసలిఁ జేరి వస్త్రసహిత ప్రోక్షితభిక్షాకపా
లమఁ డై పావనహోమధూమపటలాప్లావంబు లౌ ధూసురేం
ద్రవసత్రేణులఁ జేరి మాధుకర మెత్తన్నేఁడె మర్త్యాఁడు తు
ల్యవల న్వేఁడఁగ నేల శ్రీసూరిభిమల్లా వైదుషీభూషణా. 23

మ. అమరద్వీపవతీతరంగకణశీతారామము ల్గావసో
త్తమవిద్యాధరసిద్ధసంఘరుచిరోదంచచ్ఛిలాభోగము ల్
హిమవత్పర్వతభూము లేవఁటుకఁ బోయె న్నాటికై నుర్వ్యజా
లము నాసింతురు పడింతు ల్సూరిభిమల్లా వైదుషీభూషణా. 24

మ. ద్రుమశాఖోద్భవవల్కలప్రకర ము ల్గా ల్చెచ్చెనే శైలజా
లములందున్ ఫలమూలకందజలము ల్పా డయ్యెనే కృచ్ఛ్రల
బ్ధమనోవృత్తమదాలినాప్తి బోమ లుత్కంపించుచున్నలఁ గా
ల్వ ముఖం బేమి జనాళికి న్సూరిభిమల్లా వైదుషీభూషణా. 25

మ. ఖలు లై వైభవగర్వదుర్వ్యాకృతిరోగగ్రస్తు లై తూఁగుదు
ర్నుల వర్జించి దరిద్రు లైన నిల కార్య ల్వల్కలా స్తీర్ణభూ
తలశయ్యా న్ఫలమూలసేవను బ్రమోదస్ఫూర్తిఁ బ్రాపింతు ర
త్యలఘూర్వీధరవాసు లై సూరిభిమల్లా వైదుషీభూషణా. 26

మ. అభిరామాకృతి నెల్లెడన్ నదులతోయం బుండఁగా నెప్పుడై
న భుజింప దరుశాఖల న్ఫలము లుండఁగాఁ బరుండ న్వినూ
త్నభవత్పల్లవరమ్య మాధరణి యుండఁగా వగన్ విత్తవ
ల్లభులన్ గొల్వఁగ నేలొకో సూరిభిమల్లా వైదుషీభూషణా. 27

శా. తృష్ణానాథాశ్రయదుఃఖభారమున భోగస్వాదుసౌఖ్యంబులన్
నానాభంగులఁ బోయెఁగా దినము లిన్నాళ్లించు లోలోనగున్
ధ్యానాంతంబులఁ దొల్లి దాఁ బడినపాట్లంతంతఁ దోఁపం బ్రబో
ధానందుండు వనస్థుఁడై సురభిమల్లా వైదుషీభూషణా. 28

మ. పరితుష్టాత్ములు వాంఛ సేయ రతిలుబ్ధస్వాంతు ల్వాఁడ్రమం
బరితోషం బొనరింపఁ జాలుదురె సంపద్దామ మా మేరుభూ
ధర మాత్రైకసమాప్తవైభవము వ్యర్థం బెంచు నే నెంచెదన్
హరసేవానిరతాత్మ శ్రీసురభిమల్లా వైదుషీభూషణా. 29

శా. అక్షీణం బభయం బనల్పమతులం బానందసంపాది యా
ర్యక్షేమంకర మప్రయత్నసులభం బద్వేషదోషం బిలన్
భిక్షాజీవిక శంభుసత్ర మది యందే జ్ఞాను లాసింతు ర
ధ్యాక్షేపస్థిరవిక్రమా సురభిమల్లా వైదుషీభూషణా. 30

---

## భోగాస్థైర్యము.

మ. చ్యుతిచే వంశము రాజుచే ధనము రోగౌఘంబుచే భోగసం
తతి విద్వేషులచే బలంబు జరచేత న్రూపు కార్పణ్యసం
స్థితిచే మానము చాడిచే గుణము భీతిన్ జెందు నిర్భీతికం
బతులజ్ఞానమె సుమ్ము శ్రీసురభిమల్లా వైదుషీభూషణా. 31

మ. జర తారుణ్యము దుర్జనాళి నృపు నస్థైర్యంబు శ్రీ నాశ హృ
త్పరితోషంబు ఘను ల్వనప్రతతిఁ గాంతావిభ్రమంబు ల్పిశాం
తిరుచి న్దుష్టజనంబు సద్గుణవిభూతి న్సొంపఱుం జేయుఁ జె
ల్లరె సాతంకము సర్వము న్సురభిమల్లా వైదుషీభూషణా, 32

శా. దేవుం డెద్ది తిరం బొనర్చె నతఁ డాధివ్యాధి నానావికా
రావృత్తి స్థితి మాలి ప్రాణితతి సంతంత జ్జర న్ముంచు ద్వా
రావష్టంభము లేక దుర్దశలు డాయ న్జేయు లక్ష్మీవిలా
సావేశంబుల కెమ్మెయిన్ సురభిమల్లా వైదుషీభూషణా. 33

మ. అలరుం బ్రాయము లఘుత్వంబులు తరంగాకారము ల్వైభవం
బులు ప్రాణంబులు నశ్వరంబులు దినంబుల్ స్వల్పము ల్కాఁపురం
బులు తుచ్ఛంబు లటంచు నెంచి యనయంబున్ బుణ్యసంకల్పముల్
దలఁచున్ దత్త్వవిదుండు శ్రీసురభిమల్లా వైదుషీభూషణా. 34

మ. ప్రసరద్వాయుపరిప్లవాభ్రసలిలప్రాయంబు ప్రాణంబు మే
ఘసమూహాంతరచంచలాచలము భోగశ్రేణి తారుణ్యలా
లసలుం దుచ్ఛము లంచు నెంచి యవిలోలస్వాంతుఁ డేగు న్సధై
ర్యసమాధిస్థితిసిద్ధికి న్సురభిమల్లా వైదుషీభూషణా. 35

మ. యువతీభోగకథ ల్తటిత్సమము లాయుస్సీమ కల్లోలజా
లవిలోలం బెలప్రాయము ల్నిమిషకల్పంబు ల్ధనశ్రేణు ల
ధ్రువము ల్భోగము లసిరంబు లనుచున్ దూషించి తత్జ్ఞుండు బ్ర
హ్మవిచారంబునకుం జను న్సురభిమల్లా వైదుషీభూషణా. 36

మ. ప్రసరచ్ఛోణితమాతృకుక్షితలనిర్బంధాధివాసంబు ని
ష్టసతీసంగవియోగ చింతలును యోషాదూషితం బౌ జరా
వ్యసనం బింతియె కా కిసీ భవమునం దాత్మ న్విచారింప స్వ
ల్పసుఖం బైన లభించునే సురభిమల్లా వైదుషీభూషణా. 37

మ. నిరతం బాయువు భగ్నకుంభ సలిలానీకంబున ల్లేఁగఁగా
నరుల ట్లామయము ల్తనువ్యథలు సేయంగా వెస న్లోఁగొనన్
జర దా బెబ్బులిభంగిఁ గాచుకొని యుండంగా నయో యేల సే
యరు లోకు ల్హితయత్నము ల్సురభిమల్లా వైదుషీభూషణా. 38

మ. అమితాకారము లైనభోగములు మాయాజాలముల్ తత్ప్రసం
గమె సంసారనిమిత్తభూత మిది యాకాంక్షింప కాశాతరం
గముల న్విహ్వాల మైనచిత్తము సమాకర్షించి యుల్లల్ల బ్ర
హ్మమునం జేర్చుట మే లగున్ సురభిమల్లా వైదుషీభూషణా. 39

మ. పరమేష్ఠిప్రముఖోన్నతు ల్తృణకణప్రాయంబు లింద్రాదిరా
జ్యరతు ల్తుచ్ఛము లంచు నెంచఁగల బ్రహ్మానంద ముజ్జృంభ మై
పరమం బై పరిపూర్ణ మై యలరఁగా భావించియు న్యోగి చి
ల్లరభోగంబులు గోరునే సురభిమల్లా వైదుషీభూషణా. 40

---

## కాలమహిమ

శా. ఇంబు ల్గుల్కెడుసేనసేనపురము ల్పృథ్వీశులు న్వారియ
ర్థంబు ల్వారిసుతాప్తభృత్యబలము ల్రాజౌఘము ల్వారిభో
గంబు ల్వెంబడి మళ్లుమబ్బు లయి పోఁ గావింపుచుం బొల్చు కా
లంబే దైవ మవశ్యము న్సురభిమల్లా వైదుషీభూషణా. 41

మ. ఒకని న్జేయు న నేఁగా నొకనిఁ జేయుం దా ననేకాత్ముఁ గొం
జక మాయించు ఘటించుఁ బ్రాణివితతు ల్పారె ల్పగ న్రేయి పా
చికలు న్లోకము లెల్లఁ బాళియునుగాఁ జేకూర్చి కాలంబు ఖే
లనఁ జొచ్చెం గితవాకృతిం న్సురభిమల్లా వైదుషీభూషణా. 42

మ. గృహకృత్యంబులచే ననంవిదితమై క్షీణించు నిక్కాల మ
న్వహము న్సూర్యగతాగతక్రమవశం బై యాయు వేఁగు న్రుచుల్
బహుభంగు ల్సకలం బెఱింగియు జను ల్సమ్మోహకాదంబరీ
లహరి న్భ్రాంతి వహింతు రా సురభిమల్లా వైదుషీభూషణా. 43

మ. ఇనుఁ డేతెంచె నినుండు గ్రుంకెఁ బగ లయ్యె న్రాత్రి జా మయ్యె రెం
డనుచున్ నిత్యముఁ బిష్టపేషణసమవ్యాపారము ల్సేయుచున్
జను లున్మాదులు గాక యా చెనఁటిసంసారంబులో నేమి మే
ల్గన వర్తించెద రీమహి న్సురభిమల్లా వైదుషీభూషణా. 44

మ. జనివిచ్ఛేదన మైనశంభుచరణాబ్జధ్యానమా లేదు స్వ
ర్గనిజద్వారక వాటపాటి యగుధర్మంబా నహీ సుందరీ
స్తనసంశ్లేషకమా యభావము మహి న్జన్మింప నేలా జనుల్
జననీయౌవనఘాతుకు ల్సురభిమల్లా వైదుషీభూషణా. 45

మ. జవరాండ్ర న్రమియింపఁ గాన రతిభాస్వచ్చంద్రికారాత్రులన్
సవిశేషం బగువిద్య నైన నసి నైన న్వైరుల న్గెల్చి ప్రా
భవ మొప్ప న్యశ మొందఁ గానరు జను ల్పాడింటిదీపంబులీ
ల వయశ్శ్రీ వృథ యై చన న్సురభిమల్లా వైదుషీభూషణా. 46

మ. అనిశంబు న్దలిదండ్రుల న్మనుప లే రర్థం బుపార్జింప లే
రనవద్యం బగువిద్యచే నృపుల డాయ న్లేరు కాంతావిఖే
లనసౌఖ్యంబులు గాంచ లేరు పలుగూళ్ళ న్గాములు న్బ్రోలె న
ల్పనరుల్ గాలము పుత్తు రా సురభిమల్లా వైదుషీభూషణా. 47

మ. తమపెద్ద ల్చన నాత్మతుల్యహితమిత్రవ్రాత మేఁగం గ్రమ
క్రమభంగి న్సికతానదీతటతరువ్రాతంబుచందంబునన్
దమరు న్సన్నిహితప్రణాశు లగుచు న్వర్తించువారల్ నరుల్
ప్రమదం బేక్రియఁ గాంతురో సురభిమల్లా వైదుషీభూషణా. 48

మ. శతసంవత్సర మాయు వందు నిశల న్సా మేఁగు బాలత్వవృ
ద్ధతలన్ దక్కినసాములోన సగ ముత్సన్నం బగున్ నిల్చియు

న్నతఁడి న్వ్యాధివియోగదుఃఖభయచింత ల్వెన్కఁ లేదీ సుఖం
బతితుచ్ఛం బగు మేనికి న్సురభిమల్లా వైదుషీభూషణా. 49

శా. బాలుం డై కౌమరుం డగుం గృపణుఁడై భాగ్యోపసంపన్నుఁడౌ
సోలుం బాండుశిరోరుహుం డయి వళీవ్యాప్తాంగుఁ డై పిమ్మటన్
గాలాగారమహాతిరస్కరిణి కేఁగం జాగుభూర్ణుంసున
ట్లు లోకంబునఁ బ్రాణి దా సురభిమల్లా వైదుషీభూషణా. 50

## యతినృపతిసంవాదము

మ. అతఁ డైశ్వర్యమునం బ్రసిద్ధుఁడు ప్రసిద్ధాచార్యుఁడన్ నేను రా
జతఁ డే సద్గురుభక్తిసంజనిత మేధాఢ్యుండ నాతం డనా
దృతిఁ గావించిన నిస్స్పృహుండ నగు నా కేమా నటంచు న్మతిన్
యతి పాటింపఁడు భూపతి న్సురభిమల్లా వైదుషీభూషణా. 51

మ. అతఁ డర్థేశ్వరుఁ డాగమార్థపతి నే నాతండు శూరుండు వా
దితతి న్నెగ్గఁగ నే ఘనుండ నతఁ డర్థిశ్లాఘ్యుఁ డే నార్యవం
దితుఁడన్ నన్నొర మెచ్చుచున్న మును పే నే మెచ్చ నంచు న్మదిన్
యతి నిష్కామత భాసిలు న్సురభిమల్లా వైదుషీభూషణా. 52

మ. దొర దువ్వల్వలు దాల్చువల్కలము దాల్తున్ నే సమానంద మి
ద్దఱిపం బేద యన న్మహాశయుఁడె పో ధన్యుం డన న్తుష్టి భా
సురుఁడే పో మఱి యేఁ బ్రతిష్ఠుఁడ నటంచు న్మెచ్చుఁ ధరేశు బ్ర
హ్మరసాస్వాదపరుం డిల న్సురభిమల్లా వైదుషీభూషణా. 53

శా. కట్టం జీరము లుండఁగాఁ దిన ఫలౌఘం బుండఁగా శయ్యకున్
బట్టై ధారుణి యుండఁగాఁ గొలఁకుల న్పానోదకం బుండఁగాఁ
గట్టా వైభవమద్యపానచలితాక్షుంబ్రాతు లౌదుర్జనుల్
ధట్టింప న్బుధు లొత్తురే సురభిమల్లా వైదుషీభూషణా. 54

శా. భిక్షాహారము లారగింపుచుఁ బ్రతృప్తిం బొంది యెచ్చోద లే
కక్షీణం బగు మేదినీజనితశయ్యాసౌఖ్య లౌచు న్నిశల్
సుక్షౌమంబులుగా ధరింపుచు దిశా న్సొంపొందుధన్యుల్ నృపా
లక్షుద్రు న్మది మెత్తురే సురభిమల్లా వైదుషీభూషణా. 55

మ. పలుసుద్దుల్ పలురజ్జులున్ బదరుసల్పప్రజ్ఞలున్ గుబ్బచ
న్నులు గుల్కించు మెలంతలున్ సొగసుకాండ్రున్ గూడ నా పాటపా

టలవాఁ గ్రుంగన్ గొలు గాక రాజులకు నిష్ఠావంతు లౌటద్ జ్ఞా తే
ల లసద్ధ్యానశిఖీశ్వరా సురభిమల్లా వైదుషీభూషణా. 56

మ. భువనం బెంతయు నేర్ప రెందఱు ప్రగల్భు లొప్పించి పో రెంద ఱా
ర్యవరుల్ గెల్చి తృణీకరించిరి ధరన్ భూర్యధీశు లట్లేఁగ నా
రవురా యిందొకకొన్నిపల్లెలకుఁ దా రధ్యక్షు లై యల్పులే
ల వృథా గర్వ మొనర్తురో సురభిమల్లా వైదుషీభూషణా. 57

మ. ధరణీశాయుతభుక్తముక్త మగునిద్ధాత్రీతలం బంతయున్
బరిపాలించినవారు నైతము తృణప్రాయుల్ తదంశాంశముల్
పరిపాలించునృపాధముల్ వగ జుగప్సాఖేదము ల్డక్కి యే
ల రహిన్ గ్రొవ్వి చరింతురో సురభిమల్లా వైదుషీభూషణా. 58

మ. వివిధాయోధనదారుణంబుల మిథోవిద్వేషు లై తోయపం
క్తివృతం బౌపరమాణుకూటకృతమృత్పిండంబు భోగించుచున్
ద్రవిచారు ల్దొర లీవు లిత్తు రని తత్స్వల్పార్థ మాశించువా
రవమప్రాణులు గారొకో సురభిమల్లా వైదుషీభూషణా. 59

మ. భవుఁ డాత్మీయకపాల మాదల వహింపన్ మన్నవాగ్దేవతా
ధవుఁ డొక్కండె విభుండు తక్కొరుల కాత్మప్రాణసంరక్షణ
ప్రవణు ల్నల్వురు మ్రొక్కినంతనె వదింపం జెల్లునే వాని నే
ల విభుం డండ్రు సుధీజను ల్సురభిమల్లా వైదుషీభూషణా. 60

## మనస్సంబోధనము

మ. పరచేతఃప్రియ మాచరింపఁ జనుచున్ ప్రశ్రాంత మాఁ గాని తా
నరయ న్మర్త్యుల మానసంబు విమలం బై యుండ దట్లున్నఁ జె
చ్చెర నిష్టార్థము లన్నియు న్గలుగవా చింతామణిస్తోమవ
ల్లరి చేపడ్డవిధంబున న్సురభిమల్లా వైదుషీభూషణా. 61

మ. అవు నర్థం బగుఁ గానియర్థ మది గా దామాత్రమం జిత్తమే
ల వెతన్ జెందు నతీతభావిసరణు ల్తర్కింప కై నవ్వు భో
గవితానంబు భుజించు లేనితఱి నిక్కం బూర కుండు న్బుధుం
డవలం దా నిఁక నేమి శ్రీసురభిమల్లా వైదుషీభూషణా. 62

మ. విషయైకస్పృహమైఁ జరింపుదు భవస్వీకారి గా కుల్ల ము
న్నిషదాయాసనివర్తకం బయినస్వాత్మీభావముం జెందినన్

విషమక్లేశవిదూర మా సుఖగతి న్విశ్రాంత మా నాజిశే
లశదాస్యప్రతిరూప శ్రీసురభిమల్లా వైదుషీభూషణా. 63

మ. విలసజ్జహ్నుసుతాతటాభిరతి మై విశ్వేశుఁ జింతింప న
త్కాలిక స్సంపద లేల కోరనొకో చిత్తం బకటా యేటికల్
కలుషు ల్బుద్బుదము ల్మెఱుంగులు నరోఘంబు ల్ఘను ల్వహ్నికీ
లలు నమ్మం దగునా మహి న్సురభిమల్లా వైదుషీభూషణా. 64

మ. నృపతిభ్రూలతికాకుటీగణిక యాత్రేఁ గోర్కెఁ గార్యంబు కా
శీపురిం జేరి వినీతకంఠుఁ డగుచున్ శిష్టాత్ము లచ్చో జనుల్
గృప నర్పించినపాణిపాత్రభృతము ల్భిక్షాన్నముల్ దించు శీ
లపరుం డై మెలఁగం దగున్ సురభిమల్లా వైదుషీభూషణా. 65

మ. ఎదుటన్ గాణలు వెన్కఁ జామరధరల్ హేలావయోరమ్య లౌ
సుదతు ల్పార్శ్వల దాక్షిణాత్యసుకవీశు ల్గొల్తు రని నిస్పృహయుం
బె దగ న్మర్త్యుఁడు కాఁపురింపఁ దగు లేదే యోగి యై యొక్కశై
లదరిం జేరికొనం దగు న్సురభిమల్లా వైదుషీభూషణా. 66

మ. అభిరామం బగులక్ష్మి చేపడిన నే మాత్మీయమిత్రాళులన్
విభవోపేతులఁ జేసి శాత్రవరమావిస్ఫూర్తిఁ గైకొన్న నే
మి భయప్రోజ్ఝిత మై మనం గలదె భూమిన్ మర్త్యసంఘంబు దు
ర్లభ మాదేహము నిత్య మై సురభిమల్లా వైదుషీభూషణా. 67

మ. మమకారంబు త్యజించి కామనికృతు ల్మాయించి సంసారక
ర్మము లెల్ల న్మది రోసి యీశ్వరునిపై రాగంబు సాధించి సా
రము లోకానలు చేరి మానవుఁడు వైరాగ్యసుఖం బానేని యే
ల మహేంద్రాదిపదంబులు న్సురభిమల్లా వైదుషీభూషణా. 68

మ. సకలాశాపలయంబుల న్సతతసంచారంబు గావించుఁ గొం
చక నైసర్గికలోలభావమున విశ్వం బెల్ల వ్యాపించుఁ దా
నొకనాఁ డేమఱి యైన మర్త్యులమనం బూహింప మల్లాసక
ల్పవుఁ డైనట్టిమహేశ్వరున్ సురభిమల్లా వైదుషీభూషణా. 69

మ. అసురేంద్రాదిపదంబు లన్నియు దరిద్రాపేక్ష్యముల్ వానినీఁ
గ మనం బుంచక నిర్వికేతి ననంతుం డై [illegible]

శమయుండై యలరారుబ్రహ్మము రహిం జర్చింప సర్వార్థముల్
సమకూరు న్సులభంబు లై సురభిమల్లా వైదుషీభూషణా. 70

---

## నిత్యానిత్యవస్తువిచారము

మ. అమరావాసపుటీవిహారఫల మా యాగాళి యంచు న్పురా
ణము లంచున్ స్మృతు లంచు వేద మనుచున్ శాస్త్రం బటంచున్ నరుల్
భ్రమచేఁ గోమటిబేరవున్ వగల కేలా చొత్తురో యాత్మ బ్ర
హ్మమునం జేర్పఁగ లేక శ్రీసురభిమల్లా వైదుషీభూషణా. 71

శా. కాలాంతాగ్ని సువర్ణశైలము పడంగా వారిరాసు ల్నెడం
గా లోకాశ్రయ మైనధారుణి నశింగాఁ గుంజరేంద్రశ్రవో
లోలం బౌతను నెంతమాత్రము నరు ల్మోహాంధు లై దీని కే
లా లోభింతు రెఱింగియు న్సురభిమల్లా వైదుషీభూషణా. 72

శా. వ్యామోహంబు వహించి వీను బధిరం బై నోరు లాలాయుతం
బై మేనానత మై రదాళి పతితం బై దృష్టి యుత్పాదితం
బై మానసస్థితి భ్రష్ట మై నరుఁడు హంసం గై యున్నఁ గైకోరు పెం
డ్లాము న్బిడ్డలు సైతమున్ సురభిమల్లా వైదుషీభూషణా. 73

మ. జరఁ బ్రాపించి కరంబు పాండుశిరోజశ్మశ్రుఁ డై యున్నయ
న్నరు నత్రిస్థగవాసిఖండ మగుచన్ డాలోదపానంబువై
ఖరి దాదవ్వుల రోసి పాయుదురు రిలన్ గింజాక్షు లుద్వేల్లబ
ల్లరగండాదిమహాంక శ్రీసురభిమల్లా వైదుషీభూషణా. 74

మ. జర ప్రాప్తింపకమున్నె యక్షిబల ముత్సన్నంబు వాఁ గాకము
న్నె రుజల్ ముంపకమున్నె యాత్మహిత మన్వేషింప కజ్ఞుండు మం
దిరదాహం బగునప్డు శాంతిసిధి కెంతే కూపముం ద్రవ్వునా
లరియ ట్లై నగుఁబా టగు న్సురభి ల్లా వైదుషీభూషణా. 75

మ. ఇతిహాసాగమకావ్యము ల్చదువఁ బ్రొద్దేదీ మల ల్చేరి యా
వృత్తిమై యోగతపఃక్రియ ల్సలుపఁ బ్రొద్దేదీ యతిప్రశ్రయా
న్వితుఁ డై దాతృజనంబులం గొలువఁ బ్రొద్దేదీ కటా యాయు వ
ల్పతరం బై నమత్ప్రాణికిన్ సురభిమల్లా వైదుషీభూషణా. 76

మ. దొర లత్యంతమదాంధుల్ చపలచిత్తుల్ సౌఖ్యవాంఛ ల్పుదు
ర్భరము ల్దేహవిఘాతి యైనజర దుర్వారంబు కాలుండు ము
ష్కరుఁ డొం డెద్దియు లేదు మేలు విమలజ్ఞానంబుకన్నన్ నిజం
బరయం బండితకోటికి న్సురభిమల్లా వైదుషీభూషణా. 77

మ. ధనహీనుం డయి మిత్రభృత్యరహితత్వం బొంది యరార్తి వ
చ్చిన నీయం దగఁ దప్పి దైన్యదశల న్నేవ్పడ్డవేళ న్సుప
ర్వనదీతోయపవిత్రసంజయుత మహాప్రాలేయశైలంబు మె
ల్లనఁ జేగం దగు జ్ఞానికి న్సురభిమల్లా వైదుషీభూషణా. 78

మ. హితసాంగత్యము లిందుకాంతిసుఖముల్ శృంగారకావ్యంబు లి
ష్టతమావర్తనములు న్విలాసవనము ల్సర్వంబు నత్యంతర
మ్యతరం బయ్యు ననిత్యతామతి జనింపం దద్దయుం దా నర
మ్యతరం బై కనిపించు నా సురభిమల్లా వైదుషీభూషణా. 79

మ. ఘనహర్మ్యంబులు కామినీలలితము ల్గానాదికంబు ల్మనం
బునకు న్సైఁపక కాదు తజ్జ్ఞు లనయంబు న్గీటపక్షానిల
ప్రనటద్దీపశిఖాచయంబు లనుచు న్భావించి సుమ్మీ గిరుల్
వనము ల్చేరుదు రర్మిలి న్సురభిమల్లా వైదుషీభూషణా. 80

---

## శివార్చనము

శా. ఏనాఁడైనను వేఁజగాన నయనన్ దృగ్లక్ష్యుఁ డైనన్ శ్రుతుం
డైనం గాఁడు తథావిధుండు విషయోద్యత్కుంజరీరూఢరు
ర్మ్మనక్షీణమనఃకరిన్ నిలుప గారా మొవ్వఁడో సంయమా
లానం బయ్యెడు ధారుణి న్సురభిమల్లా వైదుషీభూషణా. 81

మ. శమసంపాదిని యైనవిద్య దొరకు న్సద్గోష్ఠి గల్గు న్మనో
దమనం బబ్బు నదైన్యవృత్తియును లబ్ధం బౌ నసంగప్రచా
ర మొగిం జేమఱు నొక్కపుణ్యఫలసంప్రాప్తిన్ నిరూపింప శ
క్యము గా దెద్దియు జ్ఞానికి న్సురభిమల్లా వైదుషీభూషణా. 82

మ. సుగుణశ్రేణు లనన్యగోచరము లౌచు న్సత్త్వ క్షీణింప నిం
పగుతారుణ్య మతిక్రమింపఁ దలఁపుల్ వ్యర్థంబు లై పోవఁ బ
ప్రగతిం గాలుఁడు చేర రా జనులకు న్నాకేశశ్రేష్ఠుండౌ ది
క్కగు నందున్ దెలియంగ దగు న్సురభిమల్లా వైదుషీభూషణా. 83

మ. సకలస్థావరజంగమైకవిభుఁ డాశంభుండు సర్వాంతరా
త్మకుఁ డావిష్ణుఁడు వస్తుతత్త్వము దలంపగా నభిన్నస్వరూ
పకు లయ్యున్ మది నాగుభక్తి పరమబ్రహ్మంబు భర్గుండె యం
చకలంకస్థితి భాసిలు న్సురభిమల్లా వైదుషీభూషణా. 84

మ. కనదిందుద్యుతిపాండురంబు లగు గంగాసైకతక్షోణులన్
ఘనసంతోషభవాశ్రులై శివశివా కాశీపతీ యంచు ను
త్కనినాదంబుల దిగ్గరం బలుకుచున్ గాందారిమాందారివే
ళను ధన్యు ల్విహరింతు రా సురభిమల్లా వైదుషీభూషణా. 85

మ. తుద ము ష్పాఁ గద యంచుఁ గాఁపురపుసుద్దు ల్రోసి సన్న్యస్తసం
పదులై సాత్త్వికులై వనస్థలులు సంప్రాపించి సంపూర్ణశా
రదచంద్రాతప లౌమహానిశల శర్వశ్రీపదాంభోజముల్
మదిఁ జింతింతురు పండితు ల్సురభిమల్లా వైదుషీభూషణా. 86

శా. కాశిం జేరి త్రివేణిచెంగటఁ గటీకౌపీనమాత్రాంశుకుం
డై శీర్షంబునఁ గేలు మోడ్చుకొని శర్వా శంకరా శైలజా
ధీశా యంచు వచింపుచుం గడపుఁ బ్రీతి న్వాసరంబు ల్ఘనుం
డాశిష్టప్రవరుండు శ్రీసులబిమల్లా వైదుషీభూషణా 87

శా. గంగాతోయముల న్సుపుష్పజలసంఘాతంబున న్విశ్వభ
ర్తం గామాంతకుఁ బూజచేసి పిదప న్ధ్యానంబు గావింపుచున్
తుంగగ్రావనిషణ్ణులై యలరుధన్యుల్ దైన్యసంతాపముల్
భంగం బంద సుఖింతు రా సురభిమల్లా వైదుషీభూషణా. 88

మ. అనవద్యుండును పాణిపాత్రహృతభిక్షాహారుఁడున్ నిస్స్పృహుం
డును శాంతుండు దిగంబరుండు నయి ధన్యుం డొంటి యై భూతలం
బున వర్తింపుచు శంకరుం దలఁచుచున్ ముక్తాత్ముఁడై కర్మజా
లనిరాసం బిడుఁ జాల్కాన న్సురభిమల్లా వైదుషీభూషణా. 89

మ. ఒకచో నిల్వక పాణిపాత్రహృతనిత్యోదాత్తభిక్షాన్నుఁడై
సకలంబు న్మదిలోఁ దృణోపమముగాఁ జర్చింపుచు న్యోగిభా
వకుఁడై కాంచు నఖండబోధసుఖజీవన్ముక్తి చంద్రార్ధచు
డకృపం గాంచి జనింప డా సురభిమల్లా వైదుషీభూషణా. 90

---

## అవధూతచర్య

మ. అనిశస్వైరవిహారుఁ డై సతతభిక్షాహారుఁ డై శూన్యకా
ననదేశైకశయాళుఁ డై శిథిలకంథాజీర్ణ కౌపీనుఁ డై
ఘనయోగస్థితుఁ డై ప్రశాంతుఁ డయి వేడ్కన్ సర్వవిజ్ఞాని కే
ల నగారిప్రముఖోన్నతు ల్సురభిమల్లా వైదుషీభూషణా. 91

మ. అలఘుజ్ఞానసమగ్రుఁ డౌవిబుధుఁ డాహా పద్మగర్భాండమం
డలమాత్రంబున కేల యాసపడు నానాశైలసంవాస వా
జలధిశ్రేష్ఠము చేఁప గంతు లిడినన్ సంక్షోభముం జెందునే
లలనానూతనమన్మథా సురభిమల్లా వైదుషీభూషణా. 92

మ. సపరిస్ఫూర్తపలాశపాత్రమున భైక్షం బెత్తి తద్గ్రాసభు
క్తిపరుం డౌనవధూతశేఖరుఁడు లక్ష్మీ తల్లి రౌండేని శ్రీ
కృప వేఁడొక్కఁడ నిల్పు నిస్స్పృహుల హానే మొల్ల మే మొల్ల మం
చపరాగసితి భాసిలు న్సురభిమల్లా వైదుషీభూషణా. 93

మ. నవతల్పం బిల దివ్వె చంద్రుఁడు వితానం బాకసం బంచితం
బవువింజామర మందవాత ముపబర్హం బాత్మహస్తంబు నై
సునిరక్తిం బ్రియభామఁ గూడుకొని రాజుం బోలి సమ్భూతితో
నవధూతేంద్రుఁడు భాసిలు న్సురభిమల్లా వైదుషీభూషణా. 94

శా. హానాదాననిరక్తమార్గనిరతుం డై గ్రామరథ్యాచల
న్నానాచీరనులబ్ధకంథుఁ డయి శాంతస్వాంతుఁ డై భిక్షుఁ డై
మానాహంకృతిశూన్యుఁ డై జనపతిం బ్రాపింప కాత్మేచ్ఛ బో
ధానందుం డిలఁ గ్రుమ్మరు న్సురభిమల్లా వైదుషీభూషణా. 95

మ. జడుఁడో భిక్షుఁడొ విప్రుఁడో వృషలుఁడో జ్ఞానాఢ్యుఁడో సిద్ధుఁడో
కడవాఁడో యనుచున్ జను ల్పొరిఁబొరిన్ గన్గొంచు భాషింపఁగా
నుడువం డల్గఁడు సంతసం బిడఁడు తన్నుం గానియ ట్లుర్వి న
ల్గడ యోగీంద్రుఁడు గ్రుమ్మరు న్సురభిమల్లా వైదుషీభూషణా. 96

మ. సతతంబు న్శుచిగా నయత్నత నహింసాసాధ్య మహాఘాసవా
యుతతి న్మేసి మహీశయాళు వగు జేణోరంగమ శ్రేణియా
కృతి యోగీంద్రుఁడు దాల్చు నవ్వడువు ధాత్రి న్సర్వధర్మోత్తమం
బతులాచారధురంధరా సురభిమల్లా వైదుషీభూషణా. 97

మ. మలరాపైఁ జదలేటిరొడ్డుశిలలం బద్మాసనాసీను లై
తలఁ పాత్మేశ్వరుఁ జేర్చి యోగమయనిద్ర న్బాయిలంగా మృగం
బులు పై రాచుకొన న్దపస్స్వలదినంబు ల్సద్దినంబు ల్సమీ
లలితజ్ఞానఘురంధరా సురభిమల్లా వైదుషీభూషణా. 98

మ. అమలం బౌశరపాత్ర తోర మగుభిక్షాహార మస్వల్ప మై
నమహీతల్ప మఖండదిక్పటము నానందంబు సేయంగ సం
గమహాదైన్యవిముక్తు లై మనుఘను ల్కర్మౌఘనిర్మూలనో
ద్యము లై పొల్తురు సుమ్ము శ్రీసురభిమల్లా వైదుషీభూషణా. 99

శా. అంబా మేదిని మిత్ర తేజ సహజా యభ్రంబ తండ్రీ సదా
గంబా యాప్త జలంబ యుష్మదనుషంగప్రాప్తసత్పుణ్యని
ష్ఠం బెంపొందితి మీవు మ్రొక్కెద ననుజ్ఞాతుండనా యంచు బ్ర
హ్మంబుఁ గాంచు మనీషి శ్రీసురభిమల్లా వైదుషీభూషణా. 100

వైరాగ్యశతకము సమాప్తము.

---

మల్లభూపాలీయము సంపూర్ణము.



శ్రీధరాయ నమః.

పుష్పగిరి తిమ్మకవికృత

# నీతిశతకము



ఉ. శ్రీలసమానభానుశిఖిశీతమయూఖరుచుల్గ్రమించి ది
క్కాలపదాద్యుపాధులను గాంచక యంతము లేక జ్ఞానమా
త్రాలఘుతాద్వితీయపరమాకృతి స్వానుభవైకగమ్యమై
చాల వెలుంగుశాంతమయశాశ్వతతేజముఁ గూర్చి మ్రొక్కెదన్.

## మూర్ఖపద్ధతి

ఉ. బోద్ధలు మత్సరోచ్ఛలితబుద్ధుల నూఁగొనఁబో రహంక్రియా
బద్ధులు గావునన్ బ్రభులు బాలిమెయి న్వినలే రబోధపూ
న్నద్ధతి నున్కిఁ దక్కినయపండితు లెల్ల రసద్వివేకస
న్నద్ధసుభాషితంబు లివి నాతనువందె యణంగుఁ గాకికన్. 1

ఉ. అజ్ఞుఁడు సజ్జనోక్తు లెటులైన వినున్సులభంబుగా విశే
షజ్ఞుఁడు దెల్పినంత సరసస్థితి నూఁగొను జ్ఞానలేశదు
ష్ప్రాజ్ఞుల దుర్విదగ్ధుఁ డగుపామరుఁ డేగతిఁ దెల్పఁబోయిన
న్బ్రాజ్ఞతఁ జెందఁ డజ్ఞుఁడని బ్రహ్మయు రంజిలఁజేయ నోపునే. 2

చ. మకరముకోఱ నున్న పెనుమానికమైన హరింపవచ్చు దు
ష్కరచలదూర్మిఘోష మగుసాగరమైనఁ దరింపవచ్చు ఘు
త్కుపితభోగి నైనఁ బువుదండవలె న్దలఁ దాల్పవచ్చుఁ బా
యక ప్రతికూలమూర్ఖహృదయం బది త్రిప్పఁగరా దొకప్పుడున్. 3

చ. ఇసుకఁ బ్రయత్నత న్బిడిచి హెచ్చుగఁ దైలముఁ గాఁచవచ్చుఁ జె
ల్లెసఁగొడుడప్పి మ్రుక్కి మృగతృష్ణజలంబులు గ్రోలవచ్చు నల్
దెసలఁ జరించి యెక్కడుపుడు దే దొరకున్ శశపుర్విషాణము
న్నొసఁగదు దుర్వివేకి యగుమూర్ఖునిచిత్తము ద్రిప్ప నేరికిన్. 4

ఉ. బాలిశచిత్తమే జనుఁడు బల్మి సుధోక్తులఁ ద్రిప్పఁ బూను వాఁ
డీలవణాబ్ధిఁ దీపు ఘటియింపఁగఁ బూనును దేనెచొట్టుచే

బాలమృణాలతంతువులఁ బన్నగరాజముఁ గట్టఁబోవు వ
జ్రాలను బెజ్జముల్ నునుపఁజాలు శిరీషసుమాంతసంహతిన్. 5

చ. పరమహితంబుగాఁ దగుసుపాయముగా ననిశం బధీనమై
పరఁగెడునట్టు లజ్ఞతను బల్వగుకప్పడ మొప్పఁ జేసె ము
న్సరసిజగర్భుఁ డెట్లనిన సర్వ మెఱింగినవారిరచ్చలం
దెఱుఁగనివారి కాభరణ మెంచ విశేషవుమౌనమే కదా. 6

చ. ఎపు డొకయింత గంటి నని యేనుఁగుఁ గీతి మదించి యుంటినో
యపుడె సమస్త విత్ప్రభుఁడ నైతి నటంచు మదించె నామనం
బెపు డొకయించుకించుక బుధేంద్రులచెంత నెఱింగికొంటినో
యపుడె విమూర్ఖతాత్తదురహంకృతి వీడె జ్వరంబుకైవడిన్. 7

చ. తొరఁగెడుజొల్లున న్దడిసి దుష్టపుఁగంపునఁ జేరరాక లోఁ
బురువులు గాఱ నంజుడును బోఁడిమి లేనినరాస్థిఁ జొప్పఁచు
న్గొఱికెడుకుక్క పార్శ్వమునను జ్జనుదెంచినయింద్రుఁ గాంచిన
న్బొరయదు శంక తుచ్ఛులను పొందినతప్పున లెక్కసేతురే. 8

చ. సురపురినుండి శంకరునిజూటము జూటము వాసి గట్టుగ
ట్టురువడి వీడి భూమి భువినుండియు వారిధి వార్ధి నిల్వక
న్యురగులలోకము న్బొరసియు న్నెఱసె న్మఱి గంగ గావునన్
పఱదులు స్థానము ల్విడిచి నూఱుముఖంబుల గాసిఁ జెందరే. 9

... ... ... ... 10

## విద్వత్పద్ధతి

చ. సురుచిరశాస్త్రపాఠపరిశుద్ధవచస్కులు శిష్టదేయను
స్థిరనిగమాగము ల్గశుఁ బ్రసిద్ధులు సాఘను లేన్పపాలుచేఁ
బొరసిరొ లేమి యెవ్వఁడవ భూపతిదే ఘను లైనవారికే
మరసి పరీక్షకుఁడు వెల యల్పము సేసిన రత్నమల్పమే. 11

చ. కనఁబడ దెవ్వ రేబలిమిఁ గైకొనివచ్చిన నిచ్చలుణ్ సుఖం
బెనయఁగ, జేయు నరులను నిచ్చిన హెచ్చు యుగాంతవేళలం
దును జెడ దట్టివిద్య యనునూత్నధనంబు గడించికొన్నవా
రిని సవరింప నేరనివిభృత్తులతోడ విరోధ మేటికిన్. 12

చ. అధిగతవేదశాస్త్రపదమార్థులఁ బండితు లైనవారి నీ
వధిప ! నిరాకరింపవల దల్పతృణోపమ సిరులక్ష్మి య

య్యధిపుల నడ్డగింపఁగలదా మదవాస్యసితోరుగండభా
స్కంధరనిభేభరాజములఁ బిసతంతువ దేమి యడ్డమో. 13

చ. అలకమరాళసుందుఁ మది నల్కవహించిన నేని యంచపై
లలితసరోజినీవనవిలాసనివాసము మాన్పఁ గాకఁ దా
బలియుఁడ నంచు దానిదగుపాలును నీరును నేర్పరించు నే
ర్పులఁ గలసుప్రసిద్ధయశము న్హరియించుటకున్ సమర్థుఁడే. 14

చ. జలకము గంధమున్ గుసుమచారుసరోజములున్ భుజాంగదం
బులు శశిగౌరహారముఖభూషలు మర్త్యు నలంకరింప లే
వలర నలంకరించు విమలాంచితసంస్కృతవాణి యొక్కటే
పొలుపఱు సొమ్ము లెల్లఁ జెడిపోవును వాక్కుభూషణం బిలన్. 15

చ. నరులకు దాఁచిపెట్టినధనంబును జక్కనిరూపు శ్రీయశ
స్కరియును భోగభాగ్యసుఖకారిణియున్ గురుకోటికిన్ మహా
గురువు విదేశబంధువును గూర్చినదైవము రాజవశ్యమున్
వేవు సువిద్యయే ధర నవిద్యుఁడె పో పశు వర్ష మిట్టిదే. 16

చ. క్షమ మది నున్న నేల కవచం బరి యేటికి క్రోధ మున్న దా
య మలయ నేల చిచ్చు పరమౌషధ మేల సుహృత్తు గల్గ మూ
ర్ఖమనుజుఁ డున్న నేల ఫణి ద్రవ్య మ దేల సువిద్య యున్న సి
గ్గమరిన సొమ్ము లేల కవితాఢ్యత గల్గిన రాజ్య మేటికిన్. 17

చ. పరిజనకోటిపై గరుణ బంధులపై మొగమోట మల్పులం
దరతియుఁ బ్రీతి సాధుజనులం దిల శౌర్యమెన న్నయంబు తేఁ
పరులపయిన్ బుధాళియెడ నార్జవమున్ గురులందు నోర్పు పో
త్తరులెడ ధూర్తతం దెలుపు నన్యులయందె తిగు స్నిగ్ధసుల్. 18

చ. మతిఁ గలజాడ్యము ల్చెఱచు మాటల సత్యము గూర్చు మాన ము
న్నతి నొనయించుఁ బాపములు నాశ మొనర్చు మనంబున న్ప్రస
న్నత గదియించు దిక్కుల ఘనంబుగఁ గీర్తులు నించు సాధుసం
గతి యిఁక నేవిశేషములు గల్గఁగఁ జేయదు మర్త్యకోటికిన్. 19

చ. చతురమతిప్రసిద్ధియు వచఃపరిశుద్ధి ప్రబంధవర్ణన
స్థితికలనాసమృద్ధి రససిద్ధియుఁ గాంచి యుదాత్తపుణ్యభా
గతులితకీర్తిదేహధరు లై సుకవీశ్వరు లెన్నఁడున్ జరా
మృతిజనితోగ్రభీతులు వహింపక యెప్పుడు నున్నవా రిలన్. 20

---

## శౌర్యపద్ధతి

ఉ. ఆఁకట స్రుక్కిన న్ముదిమి సంగము చిక్కినఁ గష్టదుర్దశ
లోఁకినఁ గాంతి దక్కిన నసుప్రజము ల్జెడుచున్న డస్సిన
న్నీఁక మదేభకుంభపదవీపిశితస్పృహఁ జెందుసింగ మ
త్త్యాఁకట వాఁడుపు ల్మెసవునా యభిమాని మృగేంద్రుఁ డెయ్యెడన్. 21

ఉ. స్నాయువసాదు లల్పములు నంజుడు లేదది పంకదూష్య మా
హేయపుటస్థిఁ గుక్క భుజియించును రంజిలు దాన దృప్తుఁడుం
బాయను బ్రాప్తజంబుకము మాని మృగేంద్రము చించు నేనుఁగున్
డాయుదు రెల్లవారు కను దప్పియు శక్తికొలందిఁ గోరికల్. 22

చ. బలువిడి తోఁకఁ ద్రిప్పి పతిపాదము లూనుచుఁ గ్రింద వ్రాలుచు
న్వెలికిల నేలపైఁ బడుచు వేమఱు నోరుదరంబె చూపుచు
న్బలుపగు కుక్క కొక్కకడఁ బెట్టరు ధీరతఁ జూచుచున్ మదా
వళము భుజించుఁ జాటుశతవాక్యములం బెన్గణంబు లిమ్ములన్. 23

చ. ఎడతెగ కిట్లు సంసరణ మెల్లపుడున్ బరివర్తిలంగ నే
యెడ మృతిఁబొంది యెవ్వఁ డుదయింపఁడు పుట్టుక కేమి యెవ్వఁ డీ
పుడమి జనింపఁ దత్కులము భూరిసమున్నతిఁ జెందు వానిదే
యొడలును జన్మము న్బరువు లౌఁగాకచోఁ బదికోట్లు పుట్టవే. 24

చ. మానసవాససైకతసుమస్తబకాకృతి రెండువృత్తుల
న్భాసిలు మానశాలి యగుప్రాజ్ఞుఁ డ దెల్ల నఁగాఁ బురంబు దాఁ
జేసినసర్వలోకములఁ జెల్వొ సొవలఁ దాల్ప నుండు న
య్యాసలు వాసిన స్తపసి యై వనసీమల నుండు నెమ్మదిన్. 25

చ. అలగురుభార్గవప్రభృతు లైమగురు న్నరు వొంద వారిపై
నలుగక శీర్షమాత్రయుతుఁ డయ్యును జూడు విశేషవిక్రమే
చ్ఛలు గలరాహుదైత్యపతి చంద్రదినేంద్రులఁ బట్టు నిర్వ్యర
జ్జలమునఁ బర్వవేళల యశంబున కింతె మహద్విరోధమున్. 26

చ. ఘనుఁ డహిభర్తభోగఫలకంబునఁ దాల్చు జగంబు లెల్ల నా
యన నలకూర్మరాజు చరమాంగమున న్భరియించు నాగుణా
ఘ్న్యుని ధరియించు ఘోణిమణి యూనుఁ దదంగభరం బనాదృతి
స్వవధి యహార్క యూర్మ్యలయుశాంచరిత్రము లౌ విచిత్రముల్. 27

ఉ. శాణవిలీఢరత్న మరిసందళితాంగజయాఢ్యుఁడున్ మద
క్షీణగజంబు నిర్జలవిశీతల సైకతశారదాపగా
శ్రేణి కళావశిష్టశశి చెల్వలిచే రతిఁ జిక్కుబాల వి
శ్రాణనలీలఁ బేదగిలు రాజులు మింతురు కార్శ్య మొందియున్. 35

ఉ. చేరెఁడుగంజికోస మొరుచెంగటి కేఁగుచు డస్సి యున్నవాఁ
డే రసముఁ జెంది వెన్క జగ మెల్లఁ దృణంబుగ నెంచు నర్థముల్
మీఱినయందునన్ దురుసు లేక యణంగినయందున న్నరున్
జేరును బెక్కవస్థలు కృశించుట మించుట దాననే కదా. 36

ఉ. తడవ నిబద్ధ మొక్కపుడు దబ్బఱ యొక్కెడ నిష్ఠురోక్తు లొ
క్కెడఁ బ్రియవాద మొక్కపుడు హింస యొకప్డు దయాళుభావ మొ
క్కెడ ధనకాంక్ష యొక్కపుడు నిచ్చుట లొక్కెడ వెచ్చ మొక్కెడన్
గడన యొకప్డుగా గణికకైవడి నౌనృపనీతి నైకతన్. 37

చ. ఇల యనుధేనువు న్పిదుక నిచ్చ జనించినయేని రాజ ని
వెలమిని దూడఁ బెంచినటు లెప్పుడు లోకముఁ బ్రోవవయ్య ని
వలన జనంబు లెస్స యయి వర్ధిలుచుండినఁ గల్పవల్లి యుం
బలె సకలేప్సితార్థఫలవర్గము లీధర యీనఁగుండు నే. 38

ఉ. భూరితరాజ్ఞ కీర్తియును భూసురరక్షయుఁ బాత్రదాత యై
మీఱుట భోగ మొందుటయు మిత్రులఁ బ్రోచుట నాఁగ నొప్పని
యాఱుగుణంబు లేనృపులయందు రహింపవొ వారి నూరకే
యాఱడిఁ గొల్వనేల గలదా ఫల మాశ్రితకోటి కెంతయున్. 39

చ. వనజభవుండు మున్నొసట వ్రాసిన దెంతయొ యంత కొంచెమో
ఘనమొ సురాద్రి నున్న మరుస్థలముఁ జేరిన వచ్చు హెచ్చు రా
దనఘ వృథావ్యథ ల్గనకు మాఢ్యులచెంత ధరించు ధైర్య మూ
నిన ఘటి కెచ్చునే జలము నీరధి ముంచిన నూత ముంచినన్. 40

---

## దుర్జనపద్ధతి

శా. [illegible] మింత [illegible] గాదినఁ గిన్క వహించు
ష్కారుణికత్వ మెంచు టొరుకాంతఁ దలంచుట లన్యవిత్తము
గోరుట బంధులన్ సుజనులన్ గను మేలు సహింప కుండుటల్
క్రూరత్వాదు లెవ్వరులకున్ పృథ గాదు స్వభావసిద్ధముల్. 1

చ. లలితకళావిలాససమలంకృతుఁ డైనను దుర్జనుండు చెం
తల వసియింపఁగా దగఁ డనర్హుఁడు వానిఁ ద్యజింపనే తగున్
గలితనవారుణారుణధగద్ధగితోరుఫణామణిప్రభల్
గల దని చెంత నున్న భయకంప మొనర్పదె సర్ప మేరికిన్. 42

చ. త్రప జడవృత్తి సద్వ్రతము దంభము శుదత మైదుబంటు ని
ష్ఠురుఁడు గురుండ బుద్ధి ప్రియగీతులు వల్కుట దైన్యవృత్తి తే
జపుఁబస గర్వ మా శిరుఁ డశక్తుఁడు వక్త బహుప్రజల్పుఁ డం
చెపుఁగను నింద సేయు ఖలుఁ డేసుగుణంబిఁక వాఁడు మెచ్చునో. 43

చ. అవగుణ మేల లోభ మెనయన్ గొల శేటికి గొండె మున్న స
త్యవచన మున్న నేల తప మాత్మశుచిం గనఁ దీర్థ మేల మే
లవుసుజనత్వ మేల సుగుణాళిమహత్త్వమె చాలు సొమ్ము లే
ల విభవ మేల విద్య ప్రబలన్ సడిఁ జెందిన మృత్యు వేటికిన్. 44

చ. పగలిటఁ గాంతి లేనిశశి పాయము దీఱినభామ పద్మనిం
దగులమి రిత్త యాకొలను నక్షరరూపవదాస్యముల్ ధనా
శ గలప్రభుండు లేమి ననిశంబుఁ గృశించుబుధుండు భర్తయో
లగమున నుండునూచకుఁ డిలన్ విడఁగూడని సప్తశల్యముల్. 45

ఉ. ఆతతచండకోపదహనాత్మయరూక్షకటాక్షు లైనధా
త్రీతల నేతలందుఁ గలదే తనవారను ప్రీతి తప్పినన్
ఘాతయ సేయుఁజూతు రధికత్వర మండెడువహ్ని ప్రేల్చుచో
హోత నటంచు నంటుకొన నోరిచి శీతలవృత్తిఁ జూపునే. 46

ఉ. ఊరక యున్న మూఁగ వచనోద్ధతిఁ జూపిన గొంటు చేరువన్
జేరిన దంట దవ్వుల వసించినచో నసమర్థుఁ డోర్పుతో
నోరిచికొన్న భీరుఁ డను దురుక్తులు సైఁచిన జాతిహీనుఁ డం
చాఱడిఁ బెట్టు రాజు వశమా నృపసేవ యగమ్య మేరికిన్. 47

చ. సకలబలావలిన్ బ్రియ మెసంగఁ బ్రకాశ మొనర్చి హెచ్చి పా
డికిఁ జొఁగలేక తామును ఘటించినదుష్టతమాధమక్రియా
ప్రకరము లన్నియున్ మఱచి భాగ్యముచే సిరిఁ జెంది సర్వమా
షపుఁ డగుదుష్టదృష్టిఁ బడి సౌఖ్యము లెవ్వరు గాను రిమ్మహిన్. 48

ఉ. హెచ్చిలుఁ దొత్తుఁ బిమ్మట క్షయించును రేపటిపూఁటనీడ నాఁ
గుచ్చితుచెల్మి దొత్తుఁ గడుఁగొంచెమ యై మఱి మీఁద హెచ్చుచున్
వచ్చు వివేకిమచ్చిక ధ్రువంబుగ మాపటిపూఁటనీడ నా
నిచ్చలు నిత్తెఱంగెఱిఁగి నెయ్యము సేయఁదగు న్వివేకితోన్. 49

ఉ. నీరముఁ బూరి సంతసము నిచ్చులు జీవనమై పొసంగ నె
వ్వారికిఁ గీడు సేయక ప్రవర్తిలు మీనమృగార్యులందు ని
ష్కారణవైర మూనెదరు కష్టులు దాశకిరాతసూచకుల్
వారిజగర్భకట్టడయొ వారిదయారహితస్వభావమో. 50

---

## సుజనపద్ధతి

చ. పరగుణరీతిఁ బ్రీతి గురుపట్ల వినీతి బుధాప్తివాంఛయున్
దఱచుగ విద్య నాస్థయు సధర్మిణిపై రతి లోకనిందలన్
వెఱపు శివార్చభక్తి మతి నిగ్రహశక్తియు దుష్టసంగమం
దరతియుఁ గూర్చి యొప్పెడు మహాత్ములఁగూర్చి నమస్కరించెదన్. 51

ఉ. ఆపదలందు ధైర్యము మహాభ్యుదయంబున నోర్పుఁ బ్రౌఢవా
చాపటిమంబు రచ్చలను సంగరరంగమున న్పరాక్రమా
టోపము కీర్తి నిచ్చయుఁ గడున్ వ్యసనంబు శ్రుతిన్ దలిర్ప బ్ర
జ్ఞాపరు లొప్పుచుందు రివి సాజములై తమయందుఁ బొందఁగన్. 52

చ. కరమున శ్లాఘ్యదాన మెసఁగన్ దల శ్రీగురుపాదవందనం
బొరయ ముఖంబు సత్వరమఁ బూన జయాస్పదవృత్తి బాహులన్
మెఱయ మహోచ్ఛవృత్తి మది మించ శ్రుతంబు శ్రుతిద్వయిన్ దగన్
సిరులు వినా విభూషలుగఁ జేయుదు రీగుణముల్ మహామహుల్. 53

చ. ఒకరిధనంబుఁ గోర కనృతోక్తులు వల్కక వధ్యునైనఁ జం
పక తగువేళ నీని కలమాత్రము మానక నన్యుఁ గూర్చి ప
ల్కక గురుభక్తి వీడ కతికాంక్షల నూపక భూతమైత్రిఁ బా
యక నరుఁ డున్న మంచితెరు వంచు శ్రుతుల్ స్మృతు లెంచు నెప్పుడున్. 54

ఉ. సంపదఁ గన్నవేళ గుణశాలులచిత్తము గ్రూరవృత్తి వ
ర్తింపక నూత్నపల్లవశిరీషసుమోత్పలకోమలసి తిన్
సొంపు వహించు నాపదలు సోఁకినవేళ విశాలశైలని
ష్కంపతటసలస్ఫురదఖండశిలాకృతిఁ గర్కశంబగున్. 55

చ. నయగతిఁబ్రీతి ప్రాణములు నాశిలిసన్ మలినత్వ మింతలే
మియు ఖలు లన్నఁ జేరమియు మిత్రుల నొచ్చియు వేఁడఁబోనియు
న్కియు వెతలందుఁ దాల్మియు మనిషులజాడ మెలఁగుటల్ బుధా
శయములు కత్తిమీఁదిపెనుసాము లివెవ్వరిచేత నేర్చిరోఁ 56

ఉ. ఎంతయుఁనన్ సుగుప్తముగ నిత్తురు సజ్జను లిల్లుఁ జేరఁ బూ
జింతురు ప్రీతిఁజేసినది చెప్పరు మేల్ సభ నెంతు రన్యుమె

ప్పిం తన యగ్గడింతు రనయింతురు శ్రీ గలగర్వసంచిత
స్వాంతులు కత్తిమీఁది పెనుసాము లివెవ్వరికే నెఱింగిరో. 57

చ. బలువుగఁ గ్రాఁగునయ్యినుముపైఁ బడుతోయకణంబు నామమున్
బొలుపఱి తామరాకుపయి ముత్యముపోలుఁ జెలువ్వుఁ గొంతసే
పల జలబిందువే యుదధియందలిశుక్తిఁ బ్రవేశించి ముత్యమై
మలయును దత్సమం బధమమధ్యమసత్తమసంశ్రయంబుల్ క్రియల్. 58

చ. తగునడవళ్లఁ దండ్రికి ముదం బొదవించినవాఁడె పుత్రుఁ డెం
మగనికి సంతసం బెసఁగ మన్కువఁ జూపినదే పురంధ్రి ప్రే
మ గలిగి కల్మిలేముల సమంబుగ వర్తిలువాఁడె మిత్రుఁ డీ
ముగురు లభింతు రచ్యుతి మున్ సుకృతం బొనరించువారికిన్. 59

చ. ఒరులకు నమ్రులై ఘనత నొందిరి పరస్తుతి నాత్మసద్గుణ
స్ఫురణ వెలార్చి యన్యుపనిఁ బూనియు స్వాంతములు న్వహించితి ము
ష్కరులదురుక్తియుక్తు లతిశాంతిని మార్చి తదార్తికారులై
యరుదగుచర్యల న్వెలఁగునార్యులు పూజ్యులు గారె యేరికిన్. 60

---

## పరోపకారపద్ధతి

చ. ఫలములఁ బిక్కటిల్లియును పాదపముల్ దిగు నమ్రభావమున్
జలధరపంక్తి దవ్వుల నెసంగియు నమ్రత నిమ్నఁ దోయముల్
గలిమిఁ జెలంగియున్ ఘనులు గర్వముఁ జెందక యుందు రింతయున్
దలఁపఁ బరోపకారు లగుధన్యుల కైనస్వభావకృత్యముల్. 61

చ. చెవు లురుకుండలద్యుతులచేతను గాదు శ్రుతిన్ వెలుంగు ర
త్నవలయయుక్తిఁ గాదు కయి దానముచేఁ జెలఁగున్ దయామతిన్
సవు రగువారిదేహములు చందనపంకము పూఁతచేతఁగా
దవనిఁ బరోపకారమహిమాతిశయంబునఁ జాల శోభిలున్. 62

చ. జలజపరంపరన్ సురుచిసంపద నింపు నినుండు కైరవో
త్పలనికరంబుల న్గరము భాసిలఁ జేయు సుధాంశుఁ డంబుదా
వళి తనయంతఁ దాఁ గురియు వర్షము హర్షముఁ జెంద లోకమి
ట్లలఘుమతుల్ స్వయంగతపరార్థహితుల్ సుకృతుల్ దలంపఁగన్. 63

చ. ఒరులపనుల్ ఘటింతురు నిజోద్యమముల్ త్యజియించి యుత్తముల్
పరులపనుల్ స్వకార్యములుఁ బాయక పూనుదు రెల్ల మధ్యముల్
పరహితముల్ నిజార్థరతి భగ్నమొనర్తురు మర్త్యరాక్షసుల్
పరహిత మూరకే చెఱుచుపామరు లెవ్వరొ తోఁప దాత్మకున్. 64

ఉ. పాపము సేయనీకను హితపద్ధతిఁ గూర్చు రహస్య మాపనుల్
దాఁపను జూచు సద్గుణవితానము లెందుఁ దెలుపంగ నెంచుఁ దా
నాపద వచ్చినన్ విడువఁ డక్కఱవేళల నిచ్చుఁ దీర్చు సం
తాపము మంచిమిత్రుఁ డని తద్గుణముల్ బుధు లెంతు రెంతయున్. 65

చ. తనుఁ గలసెన్ జలంబు లని దానికిఁ బాల్ స్వగుణంబొసంగి వెం
టనె యది గావఁగాఁ బడసెనేని జల మోర్వక కాఁక నింకె న
య్యనుఁగువిపత్తు జూపక మహాగ్నిఁ బడంగఁ దొడంగెఁ బాలు గ్ర
క్కున జల సంగతిలోఁ గలయఁ గ్రమ్మఱె నిట్టివి సాధుమైత్రులున్. 66

ఉ. ఇందె శయించినాఁడు కమలేశ్వరుఁ డిందె వసించెఁ దద్ద్విష
ద్బృందము లిందె నిందె శిఖరిచ్ఛదులున్ శరణంబు బాడబం
బుం దగ నిందె యిందె ఘనపుష్కలముఖ్యము లున్న వద్దిరా
యెందును గాన మెంతబరు వీజలధీంద్రుని మేను పూనెడిన్. 67

ఉ. ఆతతలోకధారిచరమాంగలసత్కమఠేంద్రుఁ డొక్కఁడే
జాతుఁడు జన్మ మన్న ధ్రువజన్మమె సద్గ్రహచక్రవర్తన
స్థితక్రిందమీఁద హితశీలురు గానిజడుల్ వృథాభదా
జ్జాతభవాండభాండఫలజంతుసముల్ మృతజాతు లేటికిన్. 68

ఉ. ఆస నడంపు మాను క్షమ యానదు గర్వము నాడు సత్యమే
దోసము సేయఁబోకుము బుధు ల్సనుత్రోవనె పొమ్ము విద్వదు
ల్లాస మొనర్పు ముగ్రరిపులన్ శమియింపు వహింపు కీర్తి సం
త్రాసులఁ బ్రోవు సద్గుణము దాఁపు మివే కద సాధుకృత్యముల్. 69

చ. మనసులు వాక్కులంగములు మానితపుణ్యసుధాప్రపూర్ణతం
దనగ నిజోపకారు లుదితత్రిజగజ్జను లై పరు ల్పరిం
చినపరమాణుమాత్రగుణశీలము లద్రులు చేసి హర్షతో
యనిధుల నోల లాడుచు మహామహు లుందురు కొంద ఱిద్ధరన్. 70

## ధైర్యపద్ధతి

చ. అసురులు వార్ధిఁ ద్రచ్చునెడ నందుదయించినరత్నపాళి హ
ర్షము గన రాహాలాహలవిషంబున భీతి వహింప రాత్మ న
య్యమృతముఁ గన్నదాఁక విడ రప్పని యేతెఱఁగైన ధీరస
త్తములు సునిశ్చితార్థ మవుదాఁకఁ బ్రయత్నము మాననేర్తురే. 71

ఉ. ఊనిన నేడ విఘ్న మగునో యని నీచులు భీతిఁ గార్యమే
పూనరు మధ్యముల్ దొలుతఁ బూనియుఁ బూనక విఘ్న మైనచోఁ

మానుదు రెన్ని విఘ్నములు మాటికి వచ్చిన నెంత నొచ్చినన్
మానరు తాము పూనినసమంచితకార్యము ధీమానసుల్. 72

చ. ఒకయెడ భూమినే పరుఁడు నొక్కెడఁ బాన్పున నుండుఁ గూర లే
కొకయెడ మెక్కు లోఁగొను రసోదన మొక్కెడ నంతఁ బూనుఁ బై
నొకయెడఁ గట్టు దుప్పటము లొక్కెడఁ గార్యధురీణకిన్ మన
స్వికిఁ గలదే సుఖాసుఖవిశేషవిభాగణనాప్రసంగముల్. 73

ఉ. నీతు లెఱుంగువారు తమనింద ఘటించిన నైన నిమ్మహా
భూతులు పాయ నున్న నవి పోయినఁ జావపు డైనఁ గల్పసం
ఘాతవిరామకాలములఁ గల్గినఁ గల్గెడుఁగా కొకప్పుడున్
నీతిపథంబునం జెదర నేరరు ధైర్యరమాధురంధరుల్. 74

చ. యువతికటాక్షవీక్షణశరోద్ధతి వ్రక్కలుగాఁ ఘనరుడ్భా
పవనసఖోపతాపములఁ బాకము చెందక లోభపాశము
న్నవులక దుర్వ్యథాస్పదపృథగ్విషయాళిలఁ గాసిఁ బొందకే
యవిరళపుణ్యబుద్ధిఁ దగునాతఁడు గెల్చు సమస్తలోకముల్. 75

ఉ. ఎంతదురంతచింత ఘటియించియు ధీరునియంతరంగసం
క్రాంతనితాంతధైర్యరమ గ్రాఁపఁగ నశక్యము ప్రజ్వలచ్ఛిఖా
వంతు నొకింత క్రిందుగను వంచిన వంపఁగవచ్చుఁ గాక యు
ద్భ్రాంతతదంతరస్ఫురదుదగ్రశిఖావళి వంపఁగూడునే. 76

చ. హిమగిరితుంగశృంగమున కెక్కి తదుగ్రతటస్థలంబునన్
దుమికిన మేలు తద్విషమదుష్టశిలాహతి మేను వ్రయ్యలై
నమఱియు మేలు వ్యాళవదనంబునఁ గేలిడఁ బోన్న మేల్ శిఖిం
గుమిలిన మే లటంచు ననఘుల్ విడఁజాలరు శీలసంపదన్. 77

చ. జ్వలనుఁడు తోయమౌ జలధి స్వల్పపుఁగాలువఁ బోలుఁ గొంచె మౌ
శల యగుఁ గాంచనాచలము సింహము లేడి యగున్ మహోరగం
బలరులదండ యౌ విషముఁ ద్రావ సుధారస మౌ జగద్ధితా
కలితసుశీల మే ఘనునకీకాయమునం దగు నట్టిమేటికిన్. 78

చ. అనపృశసద్గుణాస్పదయు నార్యయు నిర్మలచిత్తయైన త
ల్లి సరిగఁ జూచి లజ్జ విడలేక భరించిన సూనృతవ్రత
వ్యసనులు తీవ్రతేజులు నిజాసుచయం బయిఁ బాసి సుఖంబుగా
మసలక మాననోపుదురు మానఁగ లేరు కృతప్రతిజ్ఞలన్. 79

చ. కలిమికి సజ్జనత్వము పొగడ్తఁదమిఁ బూనమి బన్నికోర్చుట
తెల్వికి విద్యకున్ వినయవృత్తి ధనాప్తికిఁ బాత్రదానమే

యలుగమి సత్తపస్యవ మహాప్రభువృత్తికిఁ దాల్మి ధర్మిక
చ్ఛలతవిభూషణంబు లగు సర్వగుణాఢ్యము శీలమే సుమీ. 80

---

## దైవపద్ధతి.

చ. గురుఁడు ప్రబోధకుండు దశని ఘోరపురాంబు లమరుల్ స్వసైనికుల్
పురి దివి దంతి యభ్రకరి పోటు సహాయుఁడు దైత్యభేది, యి
ట్లరు దగుబల్మి గల్గియు బలారి బలారిపుధాటి కోడఁడే
శరణము దైవమే పురుషశక్తి వృథా యది యేల కొల్పనే. 81

చ. అవవుల నాస గ్రుంగఁగఁ దను సంతయుఁ బెద్ద మునుంగ నింద్రియో
ల్లసన మణంగ నాఁకట నలంగుచు నోటన రేయి యెల్కబె
ట్టొసరఁగఁ దానపడ్డలరి డిగ్గన లోఁగొను భోగి తత్పుటి
వెసఁ జను దైవ మిచ్చు క్షయవృద్ధుల స్వసత నుండుఁడీ జనుల్. 82

ఉ. లేవడిఁ బొందియున్ వెతల లీలఁ దొఁగొందియు లేదు గ్రక్కునన్
దైవబలంబునన్ బుధుఁ డుదాత్తతఁ గందుకవృత్తి హత్తి దు
ర్భావుఁడు తద్విధంబున విపద్దశ వచ్చిన వొచ్చి నాశిలున్
లేవక మంటిముద్ద ధరణిం బడి యట్ల యణంగు కైపడిన్. 83

చ. వడి నెద యెండ బట్టతలవాఁ డొకఁ డెండను నెత్తి మండ నవ్
గడలను నీడచోఁ టరసి కొండక దవ్వుల తాటిచెట్టు గ
న్పడఁ జని క్రింద నిల్వ నలపండొక పడెన్ దల బ్రద్దలయ్యె నె
య్యెడలకుఁ జన్న దైవహతు నిందుకఁ డించక ముంచు నాపదల్. 84

చ. గజభుజగంబులం బలుఖగంబులఁ గట్టుట సూర్యచంద్రులన్
గజిబిజి చేసి దుర్గ్రహము గ్రాసము సైబడించి యేఁచుటల్
బుధమతు లౌ మహాత్ములు దరిద్రత నేఁగుటఁ జూచి యయ్యయో
నిజగతి నెంత చేసె నతినిష్ఠురదైవ మటంచుఁ గుందుదున్. 85

చ. సరసగుణాఢ్యశేషగుణసంపద నిల్వ నిధాన మౌ మహా
పురుషశిఖామణిన్ భువికి భూషణరాజముగా సృజించి య
త్తఱి క్షణభంగురంబుగను దాని నొనర్చినయట్టి యేటి నే
ర్పరి విధి యౌరాఁ జాలనఁ బండితభావము కష్ట మక్కటా. 86

చ. అతులసుధాకరస్సైకనిధి యై సకలౌషధు లేలునాథుఁ డై
శతభిషగన్వితోద్గమనసంస్కృతుఁ డై శివమౌళిభాగలం
కృతిమణి యై వెలుంగుశశి యొప్పుటఁ బాయఁడు రాజయక్ష్మమహా
హతవిధిపాక మేదొకలకైనను దాఁట నలవ్యమే కదా.

చ. హతవిధి యస్మదాలవరుఁ డాత్మ యశం బగు వృత్తికిన్ బలో
ద్ధతిఁ గొని ముద్ద చేసి వ్యథ యన్ పృథుచక్రముఁ జేర్చి యాపద
న్నతఘనదండఘాతన మనంబును బల్మఱుఁ ద్రిప్పుచున్నవాఁ
డతఁ డిఁక నేమి సేయునొ కదా చెలికాఁడ యెఱుంగ నేమియున్. 88

చ. చెడుపను లూనియే యలఁతిఁ జెందక వీయఁడియాస మాను మో
జడవిధి యాపదల్ పెంచి సాధులధైర్య మడంపఁ బూనినన్
జెడ దది కల్పసంక్షయవిశీర్ణనిజక్రమపర్వతంబులో
యడఁపఁగ నింకఁ జేయఁగ నవార్యపయోధులొ యామహాత్ములన్. 89

చ. పతివిధి యేమి యెవ్వనికిఁ బ్రాప్త మొనర్చునొ వచ్చు నంతయే
యతనికి నిచ్చసంశ్రయమహాశ్రయముల్ గుఱి గావు సర్వది
క్ప్లుతతులు నిండి మేఘములు ప్రత్యహముం గురియంగ నేమిరీ
ప్సితములు గల్గె ద్విత్రిజలబిందువులే కద చాతకాళికిన్. 90

ఉ. ఆ బిసబాంధవుం డహరహంబును దగ్గఱివారిఁ గూడి య
య్యంబరఖండ మాని తిరుగాడుచునుండును గ్రుంకుచుండుఁ ద
య్యంబరఖండ మొందియె సుధాంశుఁడు ద్రిమ్మరు రాత్రు లెల్ల దై
వం బెటు ఘటించినన్ గడవవచ్చునె దుర్గతి యెంతవారికిన్. 91

## కర్మపద్ధతి

ఉ. ఆసతి సేతునో సురల కయ్యమరుల్ హతవిధ్యధీనులే
యా నిఖిలైకవంద్యుఁ డజుఁ డాతఁడు కర్మఫలప్రదుండె క
ర్మానుగుణంబు తత్ఫల మజాదులచే నగు నేమి సద్మజుం
డైనియుఁ గర్త కాఁడు ప్రభుఁ డింతయుఁ గర్మము గాన మ్రొక్కెదన్. 92

చ. నెఱి నజు నండభాండకృతి నేమముఁ గుమ్మరిఁ జేసె నెద్ది శ్రీ
హరిని దశావతారగహనాప్తిని సంకటపెట్టె నెద్ది శం
కరునిఁ గపాలపాణిపుటకంబున భిక్షముఁ గొన్పె నెద్ది భా
స్కరు దివిఁ ద్రిప్పె నెద్ది యలకర్మముఁ గూర్చి నమస్కరించెదన్. 93

చ. కొఱఁగును సాధుగా మెఱయు కోపము గా నలి మిత్రుగా నగో
త్తమము సుగోచరంబుగ విషం బమృతంబుగఁ జేయు నెద్ది యా
సితరసత్కృతిన్ భగవతిన్ భజియింపు మభీష్టసిద్ధి కో
జగనుత మానితామితగుణాంబుల నేల వృథాసఁ జెందఁగన్. 94

సురుచిరకర్మ మున్నపుడు సున్నఘనాద్రులు చిన్నపాయపు
ద్దోఁటలు తెల్ల నాగకులికంబు హెచ్చులు నిచ్చియు నిచ్చరం

తెగి పులియినట్టు లుడు వదిఁ తప్పిన యంతయుఁ గంతుసంగరాం
తగహాతతంతు పహాత్తకవితానగతిన్ విత మై వడిన్ జెడున్. 95

చ. గుణ మగుణంబు నైన క్రియ గోరి యొనర్పఁగఁ బూనుపండితా
గ్రణి మునుమున్నె చేయఁదగు కర్మముపాకము నిశ్చయించి స
ద్గుణమతి చేయఁజెల్లు నతివత్వరితమ్ము గొంచక చేసినన్ దను
ల్బణఫల మబ్బదాఁకఁ గృతిపాకము హృద్గతి నేర్చు శల్యమై. 96

చ. జననము కర్మభూమి గని సత్క్రియ లేనిజడుండు చందనేం
ధనముల నుర్వ్యపాట్టు రతనంపుఘటంబున వండువాఁడు కాం
చనహల మూని క్షోణి దివసప్రభుమూదికి దున్నువాఁడు పా
య నతికి కప్పురంపువెలుఁ గారిగ చేలకిఁ జెట్టువాఁ డగున్. 97

చ. సుమహితరూపమున్ గులము శుద్ధపుశీలము విద్యయున్ బ్రయ
త్నము గలరాజసేవ విదితంబులె నిక్కము పూర్వజన్మపు
ణ్యముల జనించుసంచితసముంచితభాగ్యములే ఫలించుఁ గా
లమున ఫలించువృక్షములలాగున సత్యము మర్త్యకోటికిన్. 98

చ. జలముల మున్గఁగాక సురశైలము పైకొనఁగాక శత్రులన్
జెలువర సేయుఁగాక కృషి బేరము సేవలు సేయుఁగాక వి
ద్య లెఱుఁగుఁగాక పక్షివలె నభ్రగతిన్ జనుఁగాక యెంత గా
సిలినను రాదు రానిది గృహింప దవార్యము కర్మపద్ధతిన్. 99

చ. అడవుల నైనఁ దోయముల నైన విరోధులలోన నైన మం
డెడుదనమధ్యమం దైన నీరధి నైన మహాద్రి నైన నె
క్కుడ నయినన్ బ్రమాదగతిఁ గాంచిన నిద్ర వహించినన్ భరం
పడి విషమస్థితుం డయినఁ బ్రాక్సుకృతంబులె ప్రోచు మర్త్యునిన్. 100

ఉ. ఘోరవనంబు పట్టణ మగున్ జను లెల్ల స్వకీయు లౌదు రీ
ధారుణి యంతయున్ ధననిధానమణీగణపూర్ణ యై తగున్
భూరితరైకసత్క్రియలు పూర్వభవంబునఁ జేసి యున్నటం
గౌరవ మొందు ధన్యులకుఁ గావున ధర్మము సేయఁగాఁ దగున్. 101

చ. ఉరుగుణయోగి భర్తృహరియోగి చమత్కృతి సంఘటింపఁగాఁ
గరము [illegible] శతకం బది పట్టి తెనుంగుబాసచేఁ
దిరముగ [illegible] చంపకమాలికాపరం
పరలు శివాంఘ్రిపూజలుగ [illegible] లెంతయు సంతసింపఁగన్. 102

నీతిశతకము సమాప్తము.

# శ్లోకానుక్రమణిక.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA126B139 |
| పుస్తకం పేరు | భర్తృహరియోగీన్ద్రవిరచిత సుభాషితత్రిశతి |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 459 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 6 ,II |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | P. Jayamma |
| పేజీలు విడదీసినది | Jayamma |
| స్కాన్ చేసినది | Ch Ramya |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |